# అభ్యుదయ

సం. ౧ సంచిక ౪

ర్ల వెంకటేశ్వరరావు

★

ముక్కపాటి
నరసింహశాస్త్రి

★

వటిగంటి
టుంబరావు

★

నకళ్ల
కటరత్నం

★

ంకటరామశాస్త్రి

★

నారాయణరావు

★

సింహశర్మ

★

ని శెట్టి

★

శరధి

★

ప్రయాగ



# అభ్యుదయ

సచిత్ర సాహిత్య మాసపత్రిక

★

సంపుటి ౧        సంచిక ౪

జనవరి, 1947

★

సంపాదకులు :

చదలవాడ పిచ్చయ్య

కొడవటిగంటి కుటుంబరావు        జలసూత్రం రుక్మిణీనాధశాస్త్రి

ప్రయాగ కోదండరామశాస్త్రి        తుమ్మల వెంకట రామయ్య

# విషయ సూచిక


| | | | |
|---|---|---|---|
| 1. | కృష్ణశాస్త్రిగారు | ప్రయాగ | 1 |
| 2. | నవజగత్తు నిర్మిద్దాం! | 'హసన్' | 17 |
| 3. | ప్రతీకారం | 'అజంతా' | 19 |
| 4. | షావుకారు సుబ్బయ్య | కుటుంబరావు | 21 |
| 5. | నిష్క్రమణము | అనిశెట్టి | 26 |
| 6. | పై పంట | నార్ల వెంకటేశ్వరరావు | 27 |
| 7. | హాస్యం | మొక్కపాటి నరసింహశాస్త్రి | 35 |
| 8. | నవ్వెందుకు ? | జె. శ్రీరాం | 41 |
| 9. | భూస్వర్గం రావాలి! | ప్రయాగ | 44 |
| 10. | విప్లవకవి - షెల్లీ | వెంకటరామశాస్త్రి | 47 |
| 11. | రంగుల ప్రపంచం | నారాయణరావు | 61 |
| 12. | శ్రమికజాతి మేల్కొన్నది | దాశరధి | 68 |
| 13. | గ్రంథ సమీక్ష | .... | 69 |
| 14. | పిలుపు | కొనకళ్ళ వెంకటరత్నం | 71 |
| 15. | 'కులవిద్యలో కూడులేదు' | అ. నరసింహశర్మ | 72 |


ముఖ చిత్రం :

మహాకవి, శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు

అభ్యుదయ

# మూడు యుగాలకూ, మూడు తరాలకూ ప్రతినిధి - శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు

ఆంధ్రసాహిత్య పరిషత్తు, నవ్యసాహిత్య పరిషత్తు, ఆంధ్ర అభ్యుదయ రచయితలసంఘం-ఈ ప్రధాన సాహితీ సంస్థలకేగాక, ఈ మూడుతరాలకు చెందిన రచయితలకూ ప్రాతినిధ్యం వహించిన మహాకవి శ్రీదేవులపల్లి కృష్ణశాస్త్రిగారు.

ఆయన 1897నవంబరులో పిఠాపురంలో జన్మించారు. పండిత కుటుంబం. తండ్రి తమ్మన్నశాస్త్రి (వేంకట కృష్ణశాస్త్రి) గారు, పెదతండ్రి సుబ్బరాయశాస్త్రుల వారు పిఠాపురాస్థాన విద్వత్కవీశ్వరులు; చిన్ననాడే వారసత్వపు దావాలతో పదచ్యుతుడైన నేటిమహారాజుకు మళ్ళీపట్టం గట్టినయుగంధరులు. మహేంద్రవిజయం నయనోల్లాసం మొదలైన అనేకప్రబంధాలు వ్రాసి, ఉత్తమకవితా శక్తిని ప్రదర్శించి, పిఠాపురాస్థాన సింహపీఠాన్నికూడాఅధిష్టించినవారు. ఇక మాతామహులు దివాన్లు; రాచకార్యాల్లో ధురంధరులు ; ఎప్పుడూ విద్వద్గోష్టిలో మునిగితేలేవారు.

ఇటువంటి ఉన్నత కుటుంబంలో జన్మించిన కృష్ణశాస్త్రిగారికి చిన్నతనంలో గారాబం ఎక్కువ కావడం సహజం. ఎక్కువగా చదివించకూడదు. పాపం, ఎక్కడ కష్టపడిపోతాడో అని తలిదండ్రుల బెంగ. * చంద్రంపాలెం నుంచి పిఠాపురానికీ, పిఠాపురంనుంచి చంద్రంపాలానికీ వెళ్ళేటప్పుడు తండ్రులు బుజాల మీద ఎక్కించుకొని ఇష్టాగోష్టిగా అమరకోశమూ, సంస్కృత కావ్యాలు చెబుతూండేవారు.

కాని, ఎంత గారాబమైనా, ఏమైనా, లోకంలో పిల్లలందరూ వీధిబళ్ళలో చదువుకొని అలా బాగుపడి పోతూన్నప్పుడు చూస్తూ పెద్దవాళ్ళు ఎలాఉపేక్షిస్తారు. వీధిబడిలో అడుగుపెట్టారో లేదో కృష్ణశాస్త్రిగారికి ఏదో వెగటు; అసహ్యం! ఏమిటి ఆ వాసన? ఒక వైపున ఎండిపోయిన విస్తళ్ళు ఎగురుతూ టపటపా కొట్టుకుంటున్నై. రెండో వైపున ఆకులు కుట్టుకుంటూ పొడుం పీల్చి బడిపిల్లలమీద జడివాన కురిపిస్తున్నాడు పంతులు. ఒకమూల పొదుగు మంటపుట్టి దూడను మూతి పగలతంతూ గేదెగొడ్డు; రెండోమూల బెత్తం ఝుళిపిస్తూ పంతులు. బడినిండా

* చంద్రంపాలెం పిఠాపురానికి రెండుమైళ్ళలోఉన్న ఒకగ్రామం. చంద్రంపాలెంలో పెత్తండ్రిగారు, పిఠాపురంలో తండ్రిగారు వుంటుండేవారు.

ఏదో వాసన, ఏదో మింగలేని బాధ! ఈ వాతావరణం నచ్చలేదు కృష్ణశాస్త్రి గారికి. మొత్తంమీద, ఆ వీధిబళ్ళో చేరడమూ, మానడమూ ఆలస్యం లేకుండా ఒక్కనాటితోనే పూర్తయినై. కాని ఇన్‌స్పెక్టర్లు వచ్చినప్పుడు పరీక్షలకు పోకా తప్ప లేదాయనకు; ప్రమోషన్ చేయకా తప్పలేదు వారికి.

ఇటు ప్రైమరీ పరీక్ష అయింది. అటు కావ్యపాఠం సాగుతున్నది. ఆయన మీద తలిదండ్రుల ఆశలుకూడా అధికమయినై. తమలాగా గొప్ప విద్వత్కవియై పిఠాపురాస్థానానికి వెలుగు జిలుకుతాడని తండ్రిగారి ఆశ. ఇంగ్లీషు చదువుకొని పెద్ద హైకోర్టు జడ్జీయై లోకాన్ని శాసిస్తాడని తల్లిగారి ఆశ.

తండ్రులు పిఠాపురం మహారాజుకు గురువులు; అంతేకాక పితృతుల్యులుగా పూజింపబడేవారు. ఆస్థానానికి వచ్చిన కవి పండితులందరూ తమ యింటనే బస. ఒకరు కవిత్వం చెప్పేవారు; ఒకరు చర్చలు సాగించేవారు - ఒకచోట ఆశువు, ఒకచోట అవధానం - ఆస్థానంలో విద్వత్సభలూ, ఇంట్లో విద్వద్గోష్ఠులూ... ఎటుచూచినా సరస్వతీ ప్రసన్నమే! ఈ వాతావరణంలో కృష్ణశాస్త్రి గారు తన తొమ్మిదో ఏటనే ఆశువుగా పద్యాలు చెప్పడం ప్రారంభించారు. "నాయనా, నన్నయగారి మీద పద్యం చెప్పు" అని తండ్రిగారనడం తోటే, ఓ - ఇంకేం కావాలి, పదాలు దొర్లుకుంటూ పద్యం దూకుతుంది. "ఏదీ ఈ వ్యస్తాక్షరి ........" అక్షరాలు మింగుడుపడి పద్యం సాగుతుంది.

అసలీ కవిత్వాలూ, గత్తర్లూ ఏమిటి? హాయిగా, దర్జాగా ఇంగ్లీషు చదువుకొని ఏ జడ్జీ పనన్నా అయితే మగరీవిగా వుంటుంది ఈలోకం పోకడ కృష్ణ శాస్త్రిగారిని వదలిపెట్టదలచుకో లేదు పిఠాపురం హైస్కూల్లో ఇంగ్లీషు చదువు ప్రారంభించారు.

కాని, చిన్నప్పటినుంచీ చదువుకున్న అలవాటు లేదు. అంతావిని నేర్చుకోడమే. తీరా యిప్పుడు పుస్తకంపట్టి కూచోడమంటే ఎలావుంటుంది? తోటి విద్యార్థుల్ని ప్రోగుచేసి ఒకరు చదివితే తక్కినవాళ్ళు వినే ఏర్పాటు చేసుకున్నారు. అయినా, చదివినవాళ్ళందరికీ పోయి విన్న కృష్ణశాస్త్రికి ఫస్టుమార్కులు రావడం మాత్రం వింతగానే వుండేది.

ఒకనాడు అకస్మాత్తుగా ఎసెంబ్లీహాలుకు రమ్మని శాస్త్రిగారికి హెడ్ మాస్టరునుంచి కబురు ఎసెంబ్లీహాలుకు రావడమంటే ఏమిటో అందరికీతెలుసు- చేయిజాపి తలకాయవంచి తాను హెడ్మాష్టరుఎదుట నుంచోడమూ, ఆయనఅక్కడ సమావేశమైన విద్యార్థులందరకీ తనమీద నేరాలుచెప్పి తనను దెబ్బలు కొట్టడమూ!

ఇదిచాలామంది విద్యార్థులకు నిత్యకృత్యమై ఆపేకిష్టం కలిగించేదికాదుగాని, ఎన్నడూ బెంచీఅయినా ఎక్కని శాస్త్రిగారికిమాత్రం ఏదోబాధ అనిపించింది. ఏమైనా, పోకతప్పదు.

ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని ఎసెంబ్లీ హాలులోకి వెళ్ళిచూస్తే, హెడ్మాష్టరు గారిమీద అంతఅనుమానం వెయ్యడంలేదు. కానినమ్మేదెట్లా ?

హెడ్మాష్టరుగారుమాత్రం శాస్త్రిగారిని విద్యార్థులందరికీ పరిచయం చేశారు. ఈయనతండ్రిగారితో మద్రాసు వెళ్ళినప్పుడు పండిత డి. గోపాలాచార్యులుగారి దగ్గర ఆశుకవిత్వం చెప్పినందుకు ఆయన 'భాగవతం' బహుమానంగా పంపారని చెప్పి, కృష్ణశాస్త్రిగారి కిచ్చారు. ఎంతభయంతో ప్రారంభమైందో, అంతపరమా నందంగా ఆనాటిఎసెంబ్లీహాల్ సమావేశం ముగిసింది.

ఇలా శాస్త్రిగారు ఫోర్తుఫారం చదువుతున్న రోజుల్లోనే, పెదతండ్రిగారు మరణించారు, స్కూలుఫైనలుకు వచ్చేసరికి తండ్రిగారుకూడా దివంగతులైనారు.

కవి పండితులకు ఒక ఆదర్శంగా, ఒక ఆశ్రయంగా ఆ స్థానాన్ని అలంక రించిన పెత్తండ్రిగారూ....

ఆనాడు 'యతిరాజ విజయ' మనే ప్రబంధం రాజుగారి కంకితమిచ్చి నిండు సభలో ముక్తకంఠంతో వినిపిస్తున్న తండ్రిగారూ; ప్రక్కన తానూ....

తండ్రిగారి అడుగులకు మ్రొక్కి ఆలింగనం చేసుకుంటున్న మహారాజు, ఇవాళ పోతన్నగారు జ్ఞప్తికి వస్తున్నారని ప్రశంసిస్తున్న శ్రీ కూచి నరసింహం గారూ.. .ఆ దృశ్యాలన్నీ శ్రీ కృష్ణశాస్త్రిగారి కళ్ళల్లో ఒక్కసారిగా గిరుక్కున తిరిగి కరిగిపోయినై.

పిఠాపురం హైస్కూలు ప్రధానాధ్యాపకులైన శ్రీ కూచి నరసింహంగారు ప్రాచ్య పాశ్చాత్య సాహిత్య నిష్ణాత, ఆంధ్రదేశంలో అంతటి ఉపాధ్యాయుడు లేడని ప్రఖ్యాతికెక్కారు.

ఆయన ఆంగ్లకావ్యాలను బోధిస్తూ ఆశిల్పసౌందర్యాన్ని గురించే గాక, కావ్యసందేశాన్ని గురించికూడా విపులంగా చెప్పేవారు. అందువల్ల కావ్యానికీ, జీవితానికీ వుండే సంబంధమూ, ఉత్తమ కావ్యమంటే ఏమిటో - స్పష్టంగా అర్థ మయ్యేది.

అప్పటికే కృష్ణశాస్త్రిగారు డికెన్సువీ, స్కాట్‌వీ కొన్నికొన్ని నవలలు చది వారు. విజ్ఞానానికి తోడు విమర్శ. శ్రీ కూచి నరసింహంగారి దగ్గర చదువుతూ శాస్త్రిగారు తన్మయులై కొంత మనశ్శాంతి పొందగలిగారు. తండ్రులనుంచి పొందిన సాహిత్య సంప్రదాయానికీ, సంస్కారానికీ వన్నె పెట్టుకోగలిగారు.

ఇంతలోనే స్కూల్‌ఫైనల్ పరీక్షలు వచ్చినై. కాని తనకు వయస్సు 15 సంవత్సరాలే. ఎలాగయినా సంవత్సరం ఆగితీరాలి. సంవత్సరమంటే ఎంతసేపు.... ఆశువులు....అవధానాలు .... మళ్ళీ పరీక్షలు .... అయితే ఈ పరీక్షల్లో ఒక వింత జరిగింది.

అప్పట్లో గ్రాంథిక వ్యావహారిక భాషావిభేదాలూ, చర్చలూ బాగా చెలరేగినై.

సాహిత్య పరిషత్తులలోను, విశ్వవిద్యాలయాలలోను హోరాహోరిగా యుద్ధాలు ప్రారంభమయినై ఇటు పిఠాపురం మహారాజా గ్రాంధిక భాషావాది; అటుగిడుగు, గురజాడలు వ్యావహారిక భాషను వ్యాప్తిలోకి తెస్తున్నారు

ఆ సంవత్సరం ఎగ్జామినర్స్ బోర్డుకు శ్రీ గురజాడ అప్పారావుగారు అధ్యక్షులు కావడంతో - తెలుగుపేపర్లు గ్రాంధికంలోగానీ, వ్యావహారికంలోగానీ వ్రాయవచ్చునని తాఖీదు వచ్చింది కాని ఆంధ్రసాహిత్య పోషకులైన మహారాజా వారి స్కూల్ విద్యార్ధులు గ్రాంధికంలోనే వ్రాస్తే బాగుంటుందని శ్రీ కూచి నరసింహం పంతులుగారి సలహా కృష్ణశాస్త్రిగారి కీసలహా నచ్చింది, గ్రాంధికంలోనే వ్రాశారు. తెలుగు పోయినా, పరీక్ష మాత్రం పోలేదు.

స్కూల్ ఫైనల్ కాగానే, కాలేజీకి కాకినాడ పోవాలి ఎండాకాలం సెలవులకు ఇంటికి వచ్చిన కాలేజీ విద్యార్థులు శ్రీ * మొక్కపాటి రామమూర్తిగారు మొదలైనవారు కాకినాడ నుంచి అనేక విశేషాలు మోసుకొచ్చారు. కాలేజీ ప్రిన్సిపాల్‌గా వున్న ఆ రఘుపతి వెంకటరత్నంనాయుడుగారిని గూర్చి అన్నీ అద్భుతమైన కథలు. ఆయన ఉపన్యాసధోరణి, భావగాంభీర్యం, సంస్కార ప్రియత్వం, కార్యదీక్ష . ఒకటేమిటి ? అన్నీ సుగుణాలే .... ఆయన మహోదాత్తుడు .. దక్షిణాపథాకాశంలో దేదీప్యమానంగా వెలుగుతున్న ఇరువురు ధృవతారల్లో ఆయన ఒకరు ... రెండోవారు వీరేశలింగం పంతులుగారు ! పట్టాభిశీతారామయ్యగారు, ముట్నూరి కృష్ణారావుగారు, కోపల్లె హనుమంతరావుగారు .... ఆంధ్రప్రజా జీవితంలో ఆనాడు ప్రముఖపాత్ర వహించిన పెద్దలందరూ వారిశిష్యులే !

శాస్త్రిగారు సనాతన కుటుంబంలోనుంచే వచ్చారు. తాను స్కూల్ ఫైనల్ చదువుతున్న రోజుల్లో, వితంతు వివాహం చేసుకున్నందుకు శ్రీ ఆదిపూడి సోమనాధరావుగారిమీద రాళ్లు రువ్వారుకూడా. కాని, ఈ అద్భుతమైన గాదలన్నీ వింటూంటే, నాయుడుగారిమీద ఏదో అభిమానం, ఏదో భక్తిభావం కలిగి౦ది.

కాలేజీకి వెళ్ళాక ఈ అద్భుతాలన్నీ యధార్థాలవుతున్నై నాయుడుగారు ఆ అమోఘమైన వాగ్ధాటితో, సూటిగా ప్రతి విషయంలోను మహా ప్రవక్తలాగా భాషిస్తున్నారు. ఆయనలో ప్రాచ్య పాశ్చాత్య విజ్ఞానాలు మూర్తీభవించినై వివిధ మతాల్లోని ఉత్తమాదర్శాలూ ఆయన ప్రవర్తనలో నిగ్గుదేరినై, ఆయన మహావక్త మాత్రమే కాదు, మహాప్రవక్త ! దక్షిణాపథంలో అంతటి ఉపాధ్యాయుడూ లేడు ; వక్తా లేడు !

నాయుడుగారి శిష్యకోటిలో కృష్ణశాస్త్రిగారు కూడా ఒకరైనారు. పై తరగతిలో వున్న గుడిపాటి వెంకటచలంగారితోను, సహాధ్యాయి అయిన నండూరి

* శ్రీ మొక్కపాటి నరసింహశాస్త్రిగారి సోదరులు. వీరి అన్నగారే శ్రీ మొక్కపాటి సుబ్బారాయుడుగారు పిఠాపురం దివాను. సంస్కారప్రియులు, సంస్కృతాంగ్ల సాహిత్యాల్లో బాగా కృషిచేసినవారు,

సుబ్బారావుగారితోను నేస్తం కలిసింది. మొక్కపాటి రామమూర్తిగారు మొదలైన మిత్రు లుండనే వున్నారు. శాస్త్రిగారు తోటిమిత్రులతో కలిసి సంఘసంస్కరణోద్యమంలో పాల్గొన్నారు; బ్రహ్మసమాజంలో చేరారు.

నాయుడుగారు కాలేజీలో కీట్సు, షెల్లీ, టాగూరు మొదలైన మహాకవుల రచనలు బోధిస్తూవుంటే, సాహిత్య ప్రపంచంలోకి కొత్తవాకిళ్ళు తెరచినట్లయ్యేది. పర్షియన్ 'సూఫీ' సాహిత్యంలోనుంచీ, ఉర్దూ సాహిత్యంలోనుంచీ, అనేక ఉదాహరణలిస్తూ, జీవిత సంఘటనలతోనూ, ఉద్యమాలతోనూ జతపరుస్తూ నాయుడుగారి సాహిత్యోపన్యాసాలు, నూతన జగత్తుకు సోపానాలుగా వుండేవి

కృష్ణశాస్త్రిగారికి నాయుడుగారితో సంబంధం కాలేజీలో మాత్రమే కాదు. ఆయన ఇంటికి వెళ్ళి ఖురాన్, బైబిల్, గీత ఇత్యాది మతగ్రంథాలు సవిమర్శకంగా చెప్పించుకొనేవారు. శ్రీ రాజా రామమోహనరాయ్‌గారి గ్రంథాలన్నీ సాకల్యంగా చదివారు.

విశ్వజనీనమైన మతం కావాలనీ, ప్రపంచంలోని ప్రజలందరూ దేవుని దృష్టిలో ఒకటేననీ చెప్పిన మొట్టమొదటి భారతీయ తత్వవేత్త రామమోహన రాయి. సహగమనం మొదలైన దురాచారాలను రూపుమాపాడు. స్త్రీలకు కూడా పురుషులతో సమానమైన హక్కులు కావాలని పోరాడాడు. సంస్కృతాన్ని బాగా ప్రచారంలోకి తెచ్చాడు. పాశ్చాత్యవిద్యను ప్రవేశపెట్టించాడు తాను జమీందారీ కుటుంబానికి చెందిన వ్యక్తి అయినప్పటికీ, జమీందార్లకు వ్యతిరేకంగా రైతుల్ని బలపరిచాడు; ఇండిగో ప్లాంటేషన్సులో పెట్టుబడిదార్లకు వ్యతిరేకంగా కార్మికుల పక్షాన నిలబడ్డాడు. ఈ లోకంలో హెచ్చు తగ్గులుండకూడదని ఎలుగెత్తిచాటాడు. ఫ్రాన్సులో ప్రజాస్వామ్యం స్థాపించబడిందని తెలియడంతోటే, మైమరచి నృత్యం చేస్తూ "ఫ్రాన్సుకు విజయం, ఫ్రాన్సుకు విజయం" అని పాటలు పాడిన విశ్వజనీన భావం ఆయనది! భారతదేశంలో నవీన విజ్ఞాన వికాసానికి దోహదం చేసిన మహాపురుషుడు ఆయనే!

రామమోహనరాయ్‌గారి జీవితఘట్టాలను చదువుతున్నప్పుడల్లా శాస్త్రిగారి హృదయం పులకించేది. ఆయన ఉత్తమసందేశం నరనరంలోను ప్రతిధ్వనించేది. ప్రతి అభ్యుదయోద్యమంలోను ఆత్మీయత, విశ్వజనీనత ఏర్పడ్డాయి కాకినాడలోని రాత్రి పాఠశాలలూ తమవే, శిశుపోషణాలయమూ తమదే, రాజమండ్రిలోని వితంతు శరణాలయమూ తమదే, ప్రార్థనా మందిరమూ తమదే ...... ఎంత ఆత్మీయత ..... సంఘసంస్కర్త లందరూ ఒకే కుటుంబం........ రవీంద్రనాథ టాగూరు, జె. సి. బోసు, పి. సి. రే, సరోజనీదేవి, రామానంద ఛటర్జీ, అవనీంద్రనాథటాగూరు, వీరేశలింగం, నాయుడుగారు.... అందరూ ఒకే కుటుంబం. ఈ భారతీయ కుటుంబమే కాదు; ఆ రోజుల్లో యూరప్‌లో క్రైస్తవ మతసంస్క-

రోద్యమాన్ని (Unitarian Movement) తెచ్చిన * సండర్‌లాండ్ ప్రభృతులు కూడా తమ కుటుంబంలోని వారే। తాను ఇంటర్మీడియట్ చదువుతున్నకాలం లోనే శ్రీ శాస్త్రిగారికి ఈ విశ్వజనీన దృక్పథం ఏర్పడ్డది. కుల మత భేదాలు పటాపంచలై పోయినై.

ఒకవైపున శాస్త్రిగారు సంఘ సంస్కారోద్యమంలో పనిచేస్తున్నారు. కాని, ఆయనకు ప్రధానమైనది సాహిత్యం. ఫ్రెంచి సాహిత్యంలోకూడా బాగాపరిచయం సంపాదించారు. ఆంధ్రసాహిత్యంలో నూతన పంథాలను అన్వేషిస్తున్నారు.

ఇంతలో కాకినాడలో ఆంధ్రసాహిత్య పరిషత్సమావేశం జరిగింది. గిడుగు రామమూర్తి పంతులుగారు, గురజాడ అప్పారావుగారు వ్యావహారిక భాషనుగూర్చి ఉపన్యసిస్తుంటే, వారివాదం తమసంస్కార దృక్పథానికి సన్నిహితంగా కనిపించింది శాస్త్రిగారికి. తరువాత శ్రీ బసవరాజు అప్పారావుగారిద్వారా నవ్యసాహిత్యంలోని కొత్తపోకడలను శాస్త్రిగారు అవగాహన చేసుకున్నారు తానుకూడా కొత్త పోకడలతో రచన సాగించారు. తమసోదరి శ్రీమతి వింజమూరి వెంకటరత్నమ్మ గారు నడుపుతున్న "అనసూయ" అనే స్త్రీల పత్రికలో తనరచనలను ప్రచురించ నారంభించారు.

1916 సరికి ఇంటర్మీడియట్ పరీక్షలో ఉత్తీర్ణులై, బి. ఏ. చదవడానికి శాస్త్రిగారు విజయనగరం వెళ్ళారు. బి ఏ చదువుతూ విజయనగరంలో సంఘ సంస్కరణోద్యమానికి పునాదులు వేశారు. యువజన ప్రార్థనాసంఘాన్ని స్థాపించి అంతర్వర్ణ భోజనాలు మొదలైనవి ఏర్పాటు చేశారు. అనేకమంది విద్యార్థులను నూతన దృక్పథంవైపు మరలించగలిగారు.

1918 లో పట్టభద్రులై కాకినాడ వచ్చేశారు. అప్పటికి కాకినాడలో ఒక నాటక సమాజం ఏర్పడ్డది. కాని, బ్రహ్మసమాజంపెద్దలకు ఈ నాటకాలూ వేషాలూ ఏమీ పనికిరావు. వారిదంతా ఒక రకం వైదిక సంప్రదాయం అయితే కొత్త ఊహలతో కొత్త సమాజాన్ని నిర్మించాలని ఉబలాట పడుతున్న యువకులు లలితకళలను ఎలా వదులుకుంటారు? కృష్ణశాస్త్రిగారు కూడా ఈ నాటకసమాజంలో చేరి పనిచేయ నారంభించారు.

ఇంతవరకూ ఒకే కుటుంబంగా వుంటూవచ్చిన నాయుడుగారికీ, కృష్ణశాస్త్రి, చలం మొదలైనవారికీ మధ్య—నాయుడుగారు బ్రాహ్మణేతరోద్యమంలో (1919) చేరడంతో విభేదాలు పొడచూపినై. "బ్రహ్మసామాజికుడికి బ్రాహ్మణ బ్రాహ్మణేతర భేదం లేనేలేదు. అలాంటప్పుడు నాయుడుగారు బ్రాహ్మణేతరోద్యమంలో ఎందుకు చేరాలి?" అని ప్రశ్న. ఈ విభేదాలతో కృష్ణశాస్త్రి, చలం ప్రభృతులు ఒక ఉద్యమం లేవదీశారు. ఈ ఉద్యమాన్ని శ్రీ వీరేశలింగంగారుకూడా ప్రోత్స

* సండర్లాడ్ 'ఇండియా ఇన్ బాండేజ్' అనే గ్రంథంవ్రాసాడు.

హించారట. కాకినాడ నుంచి బరంపురందాకా, ప్రతి పట్నంలోను బ్రహ్మసమా జాన్ని గూర్చి, సాంఘిక సంస్కరణలను గూర్చి చలంగారి ఉపన్యాసాలూ, కృష్ణ శాస్త్రిగారి పాటలూ :

"లెమ్ము లెమ్ము వేగమె ఓ బ్రాహ్మయోధుడా
రండు మన జీవితముల కోరుచున్నది బ్రాహ్మధర్మము"
"వేగలెండయ్య ఓ బ్రాహ్మవీరులార
యుద్ధభూమికి తరలుడీ యోధులార"

కృష్ణశాస్త్రిగారు వ్రాసిన ఈ పాటలతో బ్రహ్మసమాజ ప్రార్థనలలో ఒక కొత్తదశ ఆరంభమైంది. లోగడవున్న తత్వగీతాల స్థానాన్ని ఈ కావ్యగీతా లాక్రమించాయి.

కృష్ణశాస్త్రి కవి, కళాప్రియుడు—ఆయనకు నాటకాలు కావాలి, కవిత్వాలు కావాలి, అందంకావాలి, ఆనందం కావాలి — ఇవన్నీ నాయుడుగారివంటి పెద్దల వైదిక (Puritanic) సంప్రదాయానికి పడవు. కనకనే శాస్త్రిగారు బాధ్యతలేని బ్రాహ్మా కిందలెక్క !

కానిఆయనకు బ్రహ్మసమాజమే జీవితం. ఈ విశ్వకుటుంబానికి దగ్గరగానే వుండాలి. కాకినాడలోనే మిషన్‌స్కూల్లో ఉపాధ్యాయపదవిలో ప్రవేశించి పని చేస్తూ, బ్రహ్మసమాజ కార్యకలాపం చూస్తుండేవారు.

1918 లో యుద్ధంఅయిపోయి. ఈరోజుల్లోనే బియ్యానికి కంట్రోలు, కరువూ-రెండూ వచ్చేసినై. బీదవాళ్ళకు బియ్యపుగింజ చిక్కడంలేదు. కంట్రోలు దుకాణంవద్ద ప్రొద్దుగూకులూ పడిగాపులు పడిపుంటే, పోలీసువాళ్ళ బెత్తపువాతలే ఇంటికి వచ్చేప్పుడు కనిపించేవి.

ఇదంతాచూసి కృష్ణశాస్త్రిగారు సహించలేక పోయారు. తనవిద్యార్థుల్ని కొందర్ని కూడగట్టుకొని 'సంఘ సేవక సమితి' (Social Service League)ని స్థాపించారు, కంట్రోల్ కొట్టుదగ్గిర నిలబడి బియ్యం అమ్మించారు. కిరొసిన్ అమ్మకం తామే తీసుకొని, దానిమీద వచ్చే లాభంతో ఒక 'రాత్రి పాఠశాల'ను నడిపారు.

తమ బోధనా నైపుణ్యంవల్లా, సంఘసేవవల్లా, విద్యార్థులకు అభిమాన పాత్రుడవుతున్న కొద్దీ, పాఠశాలాధికారుల ఆగ్రహానికికూడా పాత్రుడు కావలసి వచ్చింది.

కాని, ఆయనకు ఉద్యోగంకాదు, ఆత్మగౌరవం ప్రధానం. 1919 జూన్‌లోనే కాకినాడ మిషన్‌స్కూల్ ఉద్యోగానికి రాజీనామా ఇచ్చి, పెద్దాపురం మిషన్‌స్కూల్లో ప్రవేశించారు. అక్కడే వున్న శ్రీ చింతా దీక్షితులుగారూ, తామూ కలిసి వ్యావహారికభాషలో రచన సాగించాలని నిశ్చయించుకున్నారు. శ్రీ వీరేశలింగం

పంతులుగారి అధ్యక్షతను శ్రీ గిడుగు రామమూర్తిగారిచే స్థాపించబడిన 'వర్తమానాంధ్ర భాషా ప్రవర్తకసంఘం'లో సభ్యులుగా చేరారు. అప్పటినుంచీ తెలుగు దేశంలో ఏ తెలుగువాడికి ఉత్తరం వ్రాసినా, ఏ ఉపన్యాసమిచ్చినా తెలుగులోనే ; ఇదీ ఈ ఉభయులూ తీసుకున్న దీక్ష.

తరువాత దీక్షితులుగారూ, శాస్త్రిగారూ కలిసి చిన్నపిల్లల కుపయోగించే పాటలు వ్రాసి "అనసూయ" పత్రికలో ప్రచురించేవారు.

ఆ రోజులలో పెద్దాపురంలో "విద్యావినోదినీ సభ" అనే ఒక నాటకసమాజం వుండేది. ఆ నాటకసమాజానికి శాస్త్రిగారు అన్నివిధాలా తోడ్పడేవారు. వారి నాటక ప్రదర్శనా కౌశలాన్ని పెంపొందించడానికై కృషి చేసేవారు.

కాని. బహిరంగసభల్లో మాట్లాడాలని కుతూహలం....ఎట్లా మాట్లాడడం ? భయం.... రామమోహనరాయ్‌ని గూర్చి, పోతననుగూర్చి వ్యాసాలువ్రాసి సభల్లో చదవడంమాత్రం అలవాటు చేసుకున్నారు.

1920 జూన్‌కల్లా పెద్దాపురం ఉద్యోగం కాస్తా అయిపోయింది. మళ్ళీ కాకినాడ వెళ్ళేసరికి అకస్మాత్తుగా జబ్బుచేసింది...ఎన్నో మందులు....ఎందరో వైద్యులు....ఏమీ నయంకాదు....నానాటికీ శరీరం అస్థిపంజరమైపోతున్నది. ఏమీ తోచదు. ఏదోదిగులు. ఇక కాకినాడలో ఉండ బుద్ధిపుట్టలేదు. బళ్ళారికి ప్రయాణం కట్టారు.

రైలు నడుస్తున్నది. పట్టాలను అదుపులో పెట్టుకుంటూ చక్రాలు తిరిగే ఒడుపు శాస్త్రిగారి హృదయావేదనకు లయ కలుపుతున్నది. ఆ నల్లమలల్లో ఒక దాని కొకటి పెనగొని అల్లుకుపోయిన తీగెలు, వంపులుగా, ఓరలుగా, అలలుగా, తీగెలుగా మిట్టపల్లాలతో మెలితిరిగిన ఆలోయలూ కవిహృదయాన్ని చూరగొన్నై.

"ఆకులో ఆకునై
పూవులో పూవునై
కొమ్మలో కొమ్మనై
నునులేత రెమ్మనై
ఈ అడవి దాగిపోనా,
ఎటులైన
ఇచటనే ఆగిపోనా ?"

అని కృష్ణశాస్త్రిగారు ఆలపించారు. అదే కృష్ణపక్షానికి (1920) ప్రారంభం.

బళ్ళారినుంచి తిరిగివచ్చాక, రాజమండ్రిదగ్గరి కొవ్వూరులో ఒక వైద్యుని వద్ద మందుతింటూ, మంచంమీదినుంచి లేవలేని స్థితిలోనే శ్రీ శాస్త్రిగారు 'కృష్ణపక్షం' చాలాభాగం పూర్తిచేశారు. ఈ కాలంలో అనేక గ్రంథాలుకూడా చదివారు.

కాని తనకు జబ్బునయమై కాకినాడ వచ్చేసరికి, ఇన్నాళ్ళూ తన ప్రాణానికి ప్రాణంగా ఉండి ఉపచరించిన భార్యకు క్షయవ్యాధి వచ్చింది. ఆయన మనస్సు

క్రుంగిపోయింది. ఆమెను ఎలాగైనా బ్రతికించుకోవాలి. మద్రాసు ఆస్పత్రిలో చికిత్స చేయించ నారంభించారు.

ఇంతలోనే 1922 జాతీయోద్యమం వెల్లువగా వచ్చేసింది. ప్రజలందరూ స్వాతంత్రేచ్ఛతో ఆ మహోద్యమంలో పాల్గొంటున్నారు. ఎక్కడచూసినా పికెటింగులే, సత్యాగ్రహాలే. తానుకూడా ఈ ఉద్యమంలో పాల్గొనాలని శ్రీ శాస్త్రిగారి హృదయం ఉర్రూగింది. కాని, భార్యకు జబ్బు నయం చేయించుకోవాలి. అప్పటికాయన చేయగలిగింది సిల్కులు మానేసి. ఇకమీదట ఖద్దరు కట్టుకొనడమే ! అంత కంటె ఇంకా చెయ్యగలిగిం దేమీలేదు.

కాని. భార్య జబ్బు ఎంతకూ తగ్గలేదు. 1922 లోనే ఆమె కాలధర్మం చెందింది. దీంతో శాస్త్రిగారి హృదయం చితికిపోయింది. ఇంక మద్రాసులో చేసే దేముంది ? కాకినాడ వచ్చేశారు.

1919 నుంచీ శాస్త్రిగారిమీద కంటుగావున్న నాయుడుగారికి, ఈ కష్టాలన్నీ చూశాక కొంత సానుభూతి కలిగింది. శాస్త్రిగారిని పిలిచి 'డిప్యూటీ తాసీల్దారు ఉద్యోగం వుంది కావాలా ?' అని అడిగారు. కాని శాస్త్రిగారికి ఉపాధ్యాయపదవి మీద ఉన్న గౌరవం మరి యే ఉద్యోగంమీదా లేదు ఆ సంగతి నాయుడుగారికి చెప్పారు,

ఆ రోజుల్లో నండూరి సుబ్బారావుగారు కాకినాడలో వుండడం వల్ల, శాస్త్రిగారికి మంచి సాహచర్యం దొరికింది. తన దుఃఖాన్ని దిగమ్రింగుకొని మళ్ళీ సాహిత్యగోష్ఠిలోకి దిగ గలిగారు. 'కృష్ణ పక్షం' పూర్తిచేశారు. కృష్ణపక్షం వెలువడగానే సనాతన పండితమ్మన్యులు కాక పక్షులు అంటించుకొని శుక్లపక్షాలకు ఎగబ్రాకారు. కాని శాస్త్రిగారు బెదిరే రకం కాదు; ఆయన దీక్ష అచంచలం.

తరువాత 1922 జూన్‌లో పిఠాపురం మహారాజుగారు కృష్ణశాస్త్రిగారికి పిఠాపురం హైస్కూలులో ఉపాధ్యాయ పదవి ఇచ్చారు. ఇంతటితోనైనా శాస్త్రిగారు రాజీపడి వ్యావహారిక భాషోద్యమాన్నీ, తదితర విమర్శలనూ వదలుకొంటారని మహారాజా ఊహ.

పిఠాపురంలో వున్నప్పుడే కృష్ణశాస్త్రిగారు వేంకట పార్వతీశ్వర కవుల 'ఏకాంత సేవ' కు పీఠిక వ్రాశారు. 'కన్నీరు' అనే పద్యగేయ సంపుటిని ప్రకటించారు.

ఈ రోజుల్లోనే కృష్ణశాస్త్రిగారు ద్వితీయ వివాహం చేసుకున్నారు. అసలే వ్యావహారిక భాషావాదాన్ని వదలుకోలేదని మహారాజు మండిపడుతూంటే, శాస్త్రిగారు ఒక కాంగ్రెస్‌వాది కుమార్తెను పెండ్లాడి, కాంగ్రెస్ వాళ్ళతో కలిసి మెలసి తిరగడమా ? ఇది ఏమంత పరువైన పని? సంవత్సరం తిరిగే సరికి ఉద్యోగం కాస్తా ఊడింది.

ఉద్యోగం పోతే పోయింది. అప్పటికే 'సాహితి' పత్రికద్వారా మునిమా

జిక్యం నరసింహారావుగారు, శివశంకరశాస్త్రిగారు మొదలైన రచయిత లందరి తోను పరిచయం కలిగింది. సాహిత్యం మీదనే మనస్సు లగ్నమై పోయింది. కాకినాడ కాంగ్రెసు ప్రభావం శ్రీ శాస్త్రిగారి హృదయాన్ని ఊపింది. కాని ఆయన తన జీవితాన్ని సాహితీ రంగానికే అంకితం చేశారు. 1923 చివరిరోజుల్లో కవు లందర్నీ చూసి రావాలని బయలుదేరారు. నవకవులందరినీ చూసి అందరితో మైత్రి పెంపొందించుకొని, బందరు జాతీయ కళాశాలను సందర్శించి అడివి బాపిరాజు, ప్రమోదకుమార్ ఛటర్జీగార్లతో పరిచయం కలిగించుకొన్నారు.

తిరిగి పిఠాపురంవచ్చి ఆలోచించారు. ఇందరు నవకవులున్నారు. ఇంత అద్భుతంగా వ్రాస్తున్నారు. కానిఒక్కరూ వీరిపద్యాలను చదవరేమిటి? మనమే చదివి లోకానికి ఈ నవ్యసాహిత్యాన్ని పరిచయం చేయాలని శ్రీ శాస్త్రిగారు దీక్ష బూనారు. నవకవులందరి పద్యాలు వల్లించి, ప్రతిసభలోను సమావేశంలోను పాడి ప్రజలకువినిపించి, నవ్యసాహిత్యాన్ని ప్రచారంలోకితెచ్చారు.

1925 లో శ్రీ బుర్రా శేషగిరిరావుగారి ఆంధ్రభారతీతీర్థ వార్షికోత్సవంలో నవ్యకవుల రచనలు చదువడానికై శాస్త్రిగారు విజయనగరం వెళ్ళారు. ఆసమయం లోనే అక్కడ సమావేశమైన ఆంధ్రనాటక కళాపరిషత్తులో 'స్త్రీ పాత్రలు స్త్రీలే ధరించా' లని మొట్టమొదటి సారిగా తీర్మానంప్రవేశపెట్టారు శాస్త్రిగారు.

అక్కడనుండి శ్రీ గిడుగు సీతాపతిగారితో కలిసి, పర్లాకిమిడివెళ్ళి, రామమూర్తిపంతులుగారిని దర్శించి వారికితమ రచనలుచూపారు. పర్లాకిమిడిలోను, బరంపురంలోను సభలుపెట్టి నవ్యకవుల రచనలన్నీ పాడివినిపించారు.

1925 జూలైలో ...మద్రాసుప్రతి కళాశాలలోను సభలు, సమావేశాలు.... పాటలూ పద్యాలూ-

అక్కడనుంచి శ్రీ దామెర్ల వెంకటరావుగారి ఆహ్వానంమీద అనంతపురం వెళ్ళారు. అనంతపురంసభలో పాటలూ పద్యాలూ చదవడమేకాక, నవ్యసాహి త్యాన్నిగూర్చి ఉపన్యసించారు. ఇదే ఆయనతొలి ఉపన్యాసం.

మళ్ళీ తిరిగి, మద్రాసువచ్చి "ప్రణయ లేఖలకధ"ను (1926 జనవరి) వ్యావహారిక వచనంలో వ్రాశారు. ఇది 'సఖి' పత్రికలో ప్రచురించబడింది. ఈ రోజుల్లోనే శాస్త్రిగారు తన 'ప్రవాస' కావ్యాన్ని వ్రాయ నారంభించారు.

మద్రాసులో హరీంద్రనాధ ఛటోపాధ్యాయగారితో పరిచయం, స్నేహం.... ఆయనతో కలిసి బెంగుళూరు ...శాస్త్రిగారి పద్యాలకు హరీన్ * ఆంగ్లానువాదం.... బెంగుళూరునుంచి బళ్ళారి .... శ్రీ రాఘవాచార్యులుగారి దర్శనం .... బళ్ళారిలో సభలూ - ఉపన్యాసాలు - హంపీయాత్ర - "ప్రవాస" రచన .... హంపీనుంచి మద్రాసు....మళ్ళీ పిఠాపురం!

* ఈ అనువాదం అప్పుడే ఎక్కడో పోయింది.

పిఠాపురం రాగానే శాస్త్రిగారు బ్రహ్మసమాజ హరిజన విద్యార్థి వసతి గృహంతో సంబంధం పెట్టుకొని, ఆ బాలుర వైజ్ఞానికాభివృద్ధికై కృషిచేయసాగారు. వారి కవసరమైన పాటలు వ్రాసిపెట్టి వారిచేత పాడిస్తూండేవారు. వసతిగృహంలో వివిధ విషయాలమీద చర్చలూ, సభలూ ఏర్పాటు చేశారు. వారితో పూర్తిగా కలిసి పోయి, వారిలో ఒకరుగా మెలగ నారంభించారు. మాలపల్లెలకు వెళ్ళి పారశాలల్ని నెలకొల్పడం, గ్రామ పారిశుధ్యం నేర్పడం, అంతర్వర్ణ భోజనాదులు ఏర్పాటు చెయ్యడం........

ఇదంతా చూస్తుంటే బ్రాహ్మల కందరికీ గంగవెర్రులెత్తాయి. అదివరకే శాస్త్రిగారు మహారాజుకు వ్యతిరేకం కావడంవల్ల బ్రహ్మసామాజికులకు కూడా వ్యతిరేక మన్నమాటే. అప్పటికే బ్రహ్మసమాజం మహారాజు జేబులోకి పోయింది. ఇక యిప్పుడు బ్రాహ్మలుకూడా బహిష్కరించారు. ఊళ్ళో ఉండడానికి ఎవ్వరూ ఇల్లు యివ్వరు. చివరకు గొల్లల ఇళ్ళల్లో ఒకటి తీసు కోవలసి వచ్చింది. శాస్త్రి గారు ఈరోజుల్లో శాస్త్రిగారు వ్రాసిన పాటలు హరిజనుల్లో నూత్నచైతన్యాన్ని, ఆత్మవిశ్వాసాన్నీ పెంపొందించాయి. ఉదాహరణకు చూడండి.

"తెగద్రెంచండయ్యా - ఏద్వేషపు సంకెళ్ళని
తెగనివి కావయ్యా - యుగయుగములవైనా కానీ....

గుణములేని వాని దేకులమైతేనేమి, తృణమైతేనేమి శ్రీ చరణమంటునేని
ఏకౌటిల్యము వీని నేర్పరించిందో కాని, చీకటి గదులున్నే జగదీశ్వరాలయములోనే"
"ఏజాతివాడవో ఏ బ్రాహ్మణుండవో, తేజమేచెడి దేవదేవుపదములను విడి
వాడు వద్దంటావు మీదు క్రిందంటావు, బిగిసె సిగలోకులము బిగిసె జందెపుత్రాళ్ళ
సగము క్రుళ్ళితిగాని తెగదు తెగదంటావు"
"శిథిలాలయమ్ములో శివుడు లేడోయి, ప్రాంగణమ్మున గంట పలుకలేదోయి
దివ్యశంఖము గొంతు తెరువలేదోయి, పూజారి గుడినుండి పోవలేదోయి
చిత్రచిత్రపు పూలు చైత్రమాసపుపూలు, ఊరూర ఇంటింట ఊరకే పూచాయి
శిథిలాలయమ్ములో శిలకెదురుగా కునుకు, పూజారికొకటేని పూవులేదోయి"
"నాకన్న పైవాడు లేడురా, పైన, నాకన్న తండ్రి ఒకడేరా !—"

ఈ పాటలు పాడిస్తూ హరిజనబాలురతో ప్రభాతఫేరీలు నడపడమే కాక, వారిని కాకినాడ తీసుకువెళ్ళి అక్కడి బ్రాహ్మమందిరంలో 'భజన'గా పాడించారు. ఇది కాకినాడ బ్రాహ్మమందిర చరిత్రలో ఒక వినూతనమైన అపూర్వఘట్టం.

ఇలా హరిజనుల వైజ్ఞానికాభివృద్ధికి బహుముఖాలుగా తోడ్పడుతూ శాస్త్రి గారు 1927 లో 'ఊర్వశి' రచన ప్రారంభించారు. హరిజన వసతిగృహంలోనే 'ఊర్వశి' కావ్యాన్ని పూర్తిచేసి 1928 లో ప్రచురించారు.

1928 లోనే శ్రీ శాస్త్రిగారి ఆప్తమిత్రుల్లో ఒకరైన శ్రీ మొక్కపాటి రామమూర్తిగారు మద్రాసులో ఆత్మహత్య చేసుకొని చనిపోయారు. ఈ వార్త తెలిసి ఆయన పొందిన ఆవేదనకు అంతులేదు. ఆయనలో ఎక్కడలేని నిరుత్సాహము, నిస్పృహ పడగలు విప్పుకున్నై. మళ్ళీ మనశ్శాంతికోసం దేశయాత్ర చేయవలసి వచ్చింది.

1929లో బయలుదేరి కలకత్తా శాస్త్రకళాశాల(Institute of Science)లో నవ్యసాహిత్యాన్ని గురించి ఉపన్యసించారు. 'విశ్వభారతి'ని సందర్శించి, విశ్వకవి రవీంద్రునికి శిరసువంచి నమస్కరించి, ఆయన ఆశీస్సులు పొందారు, సుప్రసిద్ధ కళాకారులైన శ్రీ నందలాల్‌బోస్‌తో పరిచయం ఏర్పరచుకొన్నారు. అక్కడనుంచి ఉత్తర హిందూస్థానమంతా* పర్యటనం చేసి 1930 లో పిఠాపురం చేరుకున్నారు.

తన గడ్డమీద అడుగు పెట్టగానే మళ్ళీ సమస్యలు! హేమచంద్రసర్కార్ మొదలైనవారితో కలిసి కళావంతుల సంస్కారసంఘాన్ని స్థాపించారు శాస్త్రిగారు. తరాలుగా నీచ వ్యభిచారవృత్తితో అణగారిపోతున్న అనేకమంది దేవదాసీలకూ, సంస్థాన దాసీలకూ వివాహాలు చేయించారు.

జీవితంలో ఎప్పుడూ సమస్యలే. ఎప్పుడూ పోరాటమే. కాని 1932 లో శాస్త్రిగారికి † కుమారుడు జన్మించాడు. కుమారజననంతో శాస్త్రిగారిలో అదివరకున్న నిరాశా నిస్పృహలు మటుమాయమయినై. ఆశతోను, ఆనందంతోను నూతన జీవితం ప్రారంభమైంది. మళ్ళీ ఎందుకో మహారాజుగారికి అనుగ్రహం పుట్టుకొచ్చింది కాకినాడ కళాశాలలో లెక్చరర్‌గా నియమించారు. అప్పటినుంచీ 1941 దాకా శ్రీ శాస్త్రిగారు ఆ కళాశాలలోనే పనిచేశారు.

కళాశాల అనే పేరు ఆ రోజుల్లోనే నిజంగా సార్థకమయింది. ప్రతివిద్యార్థి నవ్యసాహిత్యాన్ని కంఠస్థం చేశాడు. సభల్లోను, సమావేశాల్లోను నవ్యసాహిత్య సరస్వతి మధురలాస్యం చేసింది. అదివరకు అంటీముట్టకుండా మడికట్టుకు కూర్చున్న కళాశాలలో అపురూపంగా నాటకప్రదర్శనాలు ప్రారంభమైనాయి. అన్నీ దీక్షితులుగారి 'శబరి' మొదలైన నవీన నాటకాలే.

ఒక్క నాటకాలేకాదు; అన్నిప్రధాన సమస్యలమీద చర్చలూ, సభలూ; కళాశాలపత్రిక-పాటలూ పద్యాలూ, కథలూ కావ్యాలూ!

శాస్త్రిగారు రావడంతో కళాశాల వాతావరణం ఏమిటో మారిపోయినట్లుగా పెద్దవాళ్ళనుడిగులు. "ఎన్నడన్నావుందా ఈ 'ఉప్పలాయి'; చదువులకంటె చర్చలు లావయినై!" అని ఒకటే సణుగుడు.

* ఈ పర్యటనం చేస్తున్న రోజుల్లోనే 'కార్తికి' అనే పాటల సంపుటిని ప్రకటించారు

† పేరు సుబ్బారాయశాస్త్రి. 'బుజ్జాయి' అనే ముద్దుపేరుతో ఇప్పుడు వ్యంగ్యచిత్రాలు గీస్తున్నాడు.

కాని, కాలం వెనక్కి నడవదు. ఎంతమంది ఎంతసణుక్కున్నా, ముందుకే నడుస్తుంది.

ఈ రోజుల్లో శ్రీ శాస్త్రిగారు 'ఆకలి' అనేపాటల సంపుటిని వ్రాశారు. ఇందులోకొన్ని "జ్వాల" లో ప్రచురించబడినై. "జై జై జై ప్రియభారతజనయిత్రీ" "యువపతాక నవపతాక అరుణారుణ జయపతాక" ఈమొదలైన పాటలు ఎక్కువ ప్రచారంలోకికూడా వచ్చినై.

అంతకు ముందే 1931 దివ్యజ్ఞాన మహాసభ (Theoistic Conference) తో పాటు జరిగిన హరిజనసభలో ఉపన్యసిస్తూ 'దక్షయజ్ఞా'నికి శాస్త్రిగారు సరికొత్త వ్యాఖ్యానం చేశారు.

శివుడు దరిద్రుడు. అతని పరివారం దరిద్రులు. కాని, అందరికీ ఐశ్వర్యం ఇచ్చేది అతనే. ప్రజాపతి అయిన దక్షుడు యజ్ఞం చేస్తూ ఇంద్రుణ్ణీ, చంద్రుణ్ణీ పిలిచి ఈ దరిద్రుల్ని తృణీకరిస్తాడు. ఓర్పుకు హద్దు దాటింది. శివుడి రౌద్రం వీరభద్రాకృతి దాల్చింది. ముప్పై మూడుకోట్ల దరిద్రులూ (ప్రమధులు) యజ్ఞమంటపం ముట్టడిస్తారు. ఇంద్రులూ చంద్రులూ పలాయనం చిత్తగిస్తారు. వీరభద్రుడు విజయభద్రుడై, విశ్వభద్రుడై నిలబడతాడు.

ఈ 'దక్షయజ్ఞం' నాటకంగా వ్రాయాలని దీనికిగాను శాస్త్రిగారు వ్రాసుకున్న పాటలు కూడా 'ఆకలి' అనే గేయసంపుటిలో ఇమిడ్చారు.

ఆంధ్రదేశంలో ప్రప్రధమంగా 'ఆంధ్రాభ్యుదయోత్సవాలు' ప్రారంభించి వివిధ విజ్ఞానరంగాల్లో కృషిచేస్తున్న పెద్దలందరినీ ఆహ్వానించి, జయప్రదంగా నిర్వహించారు కాకినాడ నగరాన్ని కళావాహినిలో ముంచెత్తారు. 1941 లో శాస్త్రిగారు లెక్చరర్ ఉద్యోగంనుంచి యధాప్రకారం విరమించుకోవలసి వచ్చింది.

అక్కడనుంచి మద్రాసువెళ్ళి సాహిత్యవ్యాసంగంలో దాదాపు ఒక సంవత్సరం ఉన్నారు. మళ్ళీ పిఠాపురం తిరిగి వచ్చేసరికి ఎందువల్లనో బ్రాహ్మలు తమ బహిష్కారాస్త్రాన్ని ఉపసంహరించుకున్నారు. తమ నెత్తిమీదుగా విమానం పోతూవుంటే ఎవరికైనా కష్టంగానే వుంటుంది. కాని, ఆపుదామంటే చేతికి అందనపుడు ఏదో ఆత్మసంతృప్తిపడి, "అది విమానం, అంతే, అది ఆకాశంలోనే పోవాలి!" అనే పరిష్కారానికి వచ్చితీరుతారు. అలాగే సంఘంకూడా, తనకు మించకుండా వుంటారనే ఆశవున్నంతవరకే బహిష్కారం. ఆ తర్వాత అన్నిటికీ ధర్మానా!

1942–43 లో శ్రీ శాస్త్రిగారు నవ్యసాహిత్య పరిషదధ్యక్షులుగా ఎన్నుకోబడ్డారు. ఏలూరు పరిషత్తు మహాసభలో యువరచయితలకు పూర్తిగా ప్రోత్సాహమిచ్చి, పరిషత్తుకు క్రొత్తజీవం పోశారు.

తర్వాత, పిఠాపురంలో వుంటూ శాస్త్రిగారు అనేక నాటికలు. 'బదరిక' అనే పద్యకావ్యమూ వ్రాశారు.

1946 లో ఆంధ్రఅభ్యుదయ రచయితల తృతీయమహాసభకు అధ్యక్షత వహించి, అభ్యుదయ రచయితలకూ, సాహిత్యపరిషత్తులోని వృద్ధరచయితలకూ సామరస్యం నెలకొల్పడమేకాక, శ్రీ కృష్ణశాస్త్రిగారు అభ్యుదయ రచయితల్లో ఒకరై తాము ముందుండి అభ్యుదయోద్యమాన్ని నడుపుతున్నారు. అభ్యుదయ రచయితలపక్షాన ముక్త్యాల నవ్యసాహిత్యపరిషత్సభలో ఆయనఇచ్చిన మహోప న్యాసం ఆంధ్రరచయితలందరూ మననంచేసుకోదగ్గది.

1946 నుంచీ శ్రీ శాస్త్రిగారు మద్రాసులోనే వుంటూ, అభ్యుదయ సాహిత్యోద్యమానికై ఇతోధికశక్తిసామర్థ్యాలతో కృషిచేస్తూ అనేక రచనలుచేస్తున్నారు.

ఉత్తమ విద్వత్కుటుంబంలో నుంచి ఉత్తమ సంస్కారాన్నీ, సంప్రదాయాన్నీ ఆత్మీయం చేసుకున్న కృష్ణశాస్త్రిగారు నూతన సంస్కృతి సంప్రదాయాలను సులభంగా అవగాహన చేసుకోగలిగారు. రాజా రామమోహనరాయ్, రవీంద్రనాథ టాగూరులు ప్రతిపాదించిన విశ్వజనీనతకు ఆశ్రయమై విశ్వగానం చేశారు. పురాతనాధునాతన సంస్కృతులు పుంజీభవించిన తేజోమూర్తితో 'కృష్ణపక్షం' లో అంధలోకాన్ని దర్శించిన మహాకవి 'దక్షయజ్ఞం' లో ప్రజావిప్లవాన్ని ప్రోత్సహించారు. ఆయన హృదయంలో విశ్వవీణాగళమే మ్రోగుతున్నది,

"నా హృదయమందు విశ్వ వీణాగళమ్ము, ఘోరుఘోరున నీనాడు మ్రోతవెట్టు ;
దశ దిశా తంత్రులొక్క సుధాశ్రుతిని బెనంగి చుక్కల మెట్లపై వంగి వంగి
నిలిచి నిలిచి నృత్యోత్సవమ్ముల చలించు.
వెలుగులో అమృతాలో తావులో మరేవో, కురియు జడులు జడులుగాగ, పొరలిపారు
కాలువలుగాగ పూర్ణకల్లోలములుగ; కలదు నాలోన క్షీరసాగరము నేడు !"

అని చెప్పుకున్నారు.

"పూవులో పూవునై, ఆకులో ఆకునై, నునులేత రెమ్మనై" అని తెలుగుదనాన్ని మూర్తీభవించుకొన్న మహాకవి; షేక్స్పియర్ కాళిదాసులనూ, షెల్లీ రవీంద్రులను తనలో ఇముడ్చుకొన్న విశ్వసాహితీపరుడు; "నా హృదయమందు విశ్వ వీణాగళమ్ము ఘోరు ఘోరున నీ నాడు మ్రోతవెట్టు" నని, విశ్వవీణను పలికించి, విశ్వశ్రేయస్కరమైన కావ్యమాల నాలపించిన కరుణామయుడు కృష్ణశాస్త్రిగారు !

— ప్రయాగ

కృష్ణశాస్త్రిగారి రచనలు :

ముద్రితాలు—1. కన్నీరు, 2. కృష్ణపక్షం, 3. ప్రవాసం, 4. ఊర్వశి, 5. బుగ్వీథి.

అముద్రితాలు—1. మహతి (నూరుగేయాలసంపుటి), 2. కార్తికి (గేయాలు), 3. ఆకలి (జాతీయ గీతాలు), 4. బదరిక (పద్యకావ్యం), 5. రేడియోనాటికలు—(1) శర్మిష్ఠ, (2) విద్యాపతి, (3) గుహుడు, (4) ధనుర్దాసు, (5) దక్షయజ్ఞం, (6) జమదగ్ని, (7) నరబలి, (8) సుప్రియ ఇత్యాది. 6 సాహిత్యవ్యాసాలు—(1) ఊర్వశి, (2) కరుణారసం, (3) ప్రాక్పశ్చిమ సాహిత్యాలు, (4) నన్నయభట్టు, (5) రవీంద్రమహాకవి మొ॥

# నవజగత్తు నిర్మిద్దాం!

'హసన్'

రేయి వేయిరెక్కలువిప్పి లోకం నడినెత్తిమీద నెమ్మదిగా నడుస్తోంది. నింగినొసటిమీద నిప్పు నెరుసుల్లా నిలుచున్న చుక్కలు ఎవరికోసమో కనుసైగలు చేస్తున్నాయి. కాలం కదలని ఎండుమోడులా నింగివంక నోరెత్తి చూస్తోంది. నడిసంద్రపు నిశ్శబ్దంలో... అరుణోదయం ఎప్పుడో!

అంతలో ఎంతోమార్పు

భూమ్యాకాశాలమధ్య భయంకర శబ్దం ........ కదలిగుండెలపై కొండలెన్నో ఫెళఫెళా విరిగి పడిపోతున్నాయి....దిక్కులు దద్దరిల్లి చెవులు మూసుకున్నాయి .... పరుగెత్తేపయోధరాల ప్రళయగర్జన....

ఆకాశం అదిరిపోతోంది ... మబ్బుముసుగుల్లో సంకులసమరం జరుగుతోంది రెక్కతెగిన పిట్టల్లా....రాలిపోతున్నాయి ........ ఎన్నో, ఎన్నెన్నో చుక్కలు...

కటికిరాత్రి కలతనిదురలో లోకం కెవ్వున అరిచింది,

మగతనుండి మేల్కొన్న మానవుడే కాళ్ళువిరిగి వెనక్కి విరుచుకు పడిపోయాడు. కాలం కాలే కొరవిలా నోట నిప్పులు గ్రక్కుతూ అతనిచుట్టూ తిరుగుతోంది.

బ్రతుకు బాటవార నిప్పుల పర్వతం ప్రళయనాట్యం చేస్తోంది.

రక్తం.... నరరక్తం .... నవజగత్తు నిర్మించే నరరక్తం . నిప్పుల నగాధరంపై ఇంధనమై దగ్ధమైపోతోంది.

ఎందరో వికలాంగులు ఎలుగెత్తి ఏడుస్తూ కడుపులు బాదుకుంటూ పడుతూ, లేస్తూ, తూలిపోతూ అగాధంలో కుప్పలై కూలిపోతున్నారు. యుద్ధం.... అంతర్యుద్ధం ... అన్నదమ్ముల అంతర్యుద్ధం........అణువణువూ గొంతెత్తి గర్జించాయి.

బిగుసుకున్న సంకెళ్ళ గలగలలో నా కన్నతల్లి కన్నీటి శోకాలు మెల్లిమెల్లిగా వినిపిస్తున్నాయి. కటకటాల సందుల్లో నా తల్లి కుమిలి కుమిలి ఏడ్చి సంకెళ్ళ నడుమ మూర్ఛిల్లి పడింది.

నాబానిసదేశం ఈనాడొక స్మశానవాటిక. రక్తసంబంధం తెగిపోయింది. అన్నకి తమ్ముడే చితిపేరుస్తున్నాడు. కాలిపోయేకొంపల్లో అమాయకప్రాణాలు ఫటఫటా ప్రేలిపోతున్నాయి కుత్తుక తెగినకళేబరం 'శాంతి' 'శాంతి' అంటూ అరుస్తూ గిజగిజా తన్నుకుంటోంది.

కాలేకాటి వెల్గులో తెల్లటివికృతాకారం ఎగిరెగిరి పడుతోంది....వెక్కిరిస్తూ వికటాట్టహాసం చేస్తోంది... దేశాన్ని రెచ్చగొడుతోంది....చిచ్చులోకి లాక్కుపోతోంది....

ముందుకుపోతే కత్తులవర్షం, వెనక్కిపోతే నిప్పుల సుడిగుండం, దిక్కులేని

నాదేశం గిలగిలా తన్నుకుంటోంది. దిక్కులేని నాప్రజ హాహా కారంచేస్తోంది.

ఉరికంబాలచాటున మాటున్నశత్రువు కత్తికి పదునెక్కిస్తున్నాడు. సంకెళ్ళు బిగదీస్తున్నాడు....మతపిశాచాల మచ్చిక చేస్తున్నాడు.

కత్తిమెరుపుల్లో కదంత్రొక్కే మతోన్మదిత మానవత్వం భగ్గునమండి బూడిదై పోతోంది....వెనుకటివీరోచిత చరిత్ర ముక్కలై చెక్కలై చెదిరి పోతోంది. తెగిన శిరస్సుల గుట్టలో భవిష్యత్తు ఊపిరాడక మూల్గుతోంది.

మానవుడా! అలాచూడు! నీసోదరి ....నట్టింట్లో....భర్తయెదుట భగ్నశీల ....వలవలా ఏడుస్తోంది....తెగినపుస్తెల పేరు దుమ్ములో కలిసిపోయింది.

మనకిది శుభంకాదు
మనకిది మేలుకాదు

ఇదిమన స్వతంత్రసమరంలోవిషాద ఘట్టం.

శవాల గుట్టమీద శత్రువు శిబిరంలో పండుగదినం జరుగుతోంది. శాశ్వతపరిపాలనకై సమారాధన జరుగుతోంది. మానవుడా! చరిత్ర తెరలొత్తిగించి చూడు. ఎర్రటి రక్తాక్షరాల్లో....మెరుస్తోంది....'ఖిలాఫత్' హిందూ ముస్లిం రక్తం నిప్పుల బాణంలా పగవాడి గుండెల్లో దూసుకుపోయిందారోజున

నాకన్న తల్లి కన్నుల అనందాశ్రువులు రాల్చిందా రోజున....
పగవాడి కోటగోడ గజగజా వణికిందా రోజున....

మానవుడా, మన దొక మహోజ్వల వీరోచిత చరిత్ర. కళంకితం చెయ్యకోకు! అహో, అదో! అదిగదో! చీకట్లను చీల్చుకుంటూ రివ్వు రివ్వున రెక్కలాడిస్తూ వస్తున్నది మెరుపుతీగ ....ఆకలి అంచులపై తిరిగే మరచక్రం వస్తున్నది.... ఎడారిలో ఒయాసిస్‌లా వస్తున్నది....ఉరికి ఉరికి వస్తున్నది ....కార్మిక హృదయం, పడగెత్తి బుసగొట్టుతోంది....కలహపిశాచాల పీకలు నొక్కేస్తున్నది.... బానిసలకు భేదం లేదంటూ....ప్రతీకార ప్రళయాట్టహాసం చేస్తూ....శత్రువు శిబిరంమీదికి దూకిదూకి పోతున్నది. అదో, అలాచూడు, కదభూమి కేకేస్తున్నది. ఎత్తిన సుత్తి కొడవళ్లై పీడితలోకం మురదుకుపోతున్నది. నల్లగొండ నడిగడ్డమీదే నైజాం సామ్రాజ్యానికి సమాధి గట్టేస్తున్నది అదే — అదే, నవసమాజ హర్మ్యానికి మొదటి మెట్టు.

నిరంకుశుల శిరస్సులే తెగనరికేస్తూ నింగిమీద నవపతాక నిలుచున్నాదదిగో మానవుడా! గతచరిత్ర మరిచిపోకు! మగతనుండి మేల్కొవోయ్! కార్మిక లోకం అభయ హస్తంచాచింది....నీవెనుకే నడుస్తోంది....మనమంతా బానిసలం....మతంలేని మానవులం... మన రక్తం....నవజగత్తు నిర్మించే మనరక్తం ....నిరర్ధకం కాకూడదు. లోకానికి అనర్ధకం రాకూడదు.

కన్నతల్లి కంఠశోష వింటున్నవా! ముందొస్తున్నది జీవన్మరణసంగ్రామం పగవాడి నెత్తుటి రాచరికంలో చరమాంకం జరుగుతోంది. మన పొట్టకూటి పోరాటంలో ప్రథమాంకం జరుగుతోంది. (మిగతా 20 వ పేజీలో)

# ప్రతీకారం

'అజంతా'

దిగాంతాన
నా యెదపై నడిచే
నల్లటి
నిశీధ నిశ్శబ్దపు నీడల్లో
నిద్రలేని నా కళ్ళు
శిథిల జీవితాల
కైవారం కొలుచుకుంటూ
చుక్కల కను సైగలపై
నడుస్తున్నాయి—

దూరంగా
ఉత్తరాన
కదలని కొండలపై
కదలే కొండల్లాటి
కారుమేఘాల ఉరుముల్లో
ఎక్కడో
ఎప్పుడో
కనపడని తీరంలో
చెలరేగిన తుపాను
చేయెత్తి పిలిచింది
ఎలుగెత్తి అరచింది—

నడిసంద్రాన
సుడిగుండంలో
ఎప్పుడో
మునిగిపోయిన ఓడ
కడలి గుండె పగిలించిన
బడబాగ్ని కీలికలా
ఆకాశం ఆఖరి అంచుమీద
గిర గిరా తిరిగింది—

గప్పున వెలిగి
ఎప్పుడో
రాలిపోయిన
చుక్కొకటి
కడలిపైన
కెరటం లేని కడలిలో
కదిలే తెరచాపల్లాటి
నీరదాల నడకలపై
నిప్పుల బాణంలా
రివ్వున దూసుకుపోయింది—

ఆకలి అరుగు మూల
చీకటి ఒడిలో
ఎపుడో
ఆఖరి వూపిరి విడిచిన
బిచ్చగాడు
పడగెత్తి
పరుగెత్తే సరీసృపంలా
ఏవో, ఏవేవో
రక రకాల
నెత్తుటి అడుగుజాడల
పసిగట్టి
బుసగొట్టుతూ
వడిగా
వడివడిగా
వెడుతున్నా డెక్కడికో—

ఎప్పుడో
ఒకనాటి నట్టనడిరాత్రి
పెనుగాలి కెరటంలో

కొట్టుకుపోయిన
పూరిగుడిసెల్లో
విరిగి ముక్కలైన
ఎముక పంజరాలు
గతకాలం సమాధి
పెకలిస్తూ పైకిలేచి
నరాల
నెత్తురు మరిగిస్తూ
కరాల
కత్తులు విదలిస్తూ
జలపాతధ్వానంలా
గర్జిస్తూ
శత్రువు శిబిరంమీదికి
దూకి, దూకి
పోతున్నాయి—

ఎప్పుడో
బీట వారిన
బ్రతుకు గోడల వెనుక
ఎవడో
ఎగ దోస్తున్న
కాటి మంటల్లో
పగిలి శకలా లౌతున్న
కపాలాలు
పదునెక్కిన పరశువులై
రా రాజుల
నెత్తుటి కిరీటాలు
పగల గొట్టి

మరో జగత్తు ముఖద్వారందాకా
వంతెనలకు
పునాదు లేస్తున్నాయి—

జీవిత రహదారిలో
ఏదో ఒక పవిత్రాశయంతో
ఎప్పుడో
ఒక విప్లవ వీరునిగుండె
విదలించిన
వేడి నెత్తుటి చుక్క
నిశీధం నొసటిమీద
పిడికి లెత్తి
ప్రతీ కారం
ప్రతీ కారం
అంటూ
అరుస్తూ
వెనుకటి కాలం
విడిచిన
కుబుసాల గుట్టమీద
నిదరోయే
నా తల్లికి
మేలుకొలుపు పాడుతోంది—

నిశీధాంతాన
నా చేతినుండి
తెగి పడ్డ
శృంఖల నినాదంలో
ఉషః కిరణంలా
భవిష్యత్తు

[18 వ పేజీ తరువాయి]

మానవుడా! మత్తువిడచి ముందడుగెయ్! మనమంతా ఒకటే ఒక హృదయ స్పందనంలా.... ఒకటే ఒక దీర్ఘ నిశ్వాసంలా.... జగమంతా ప్రసరిస్తూ, ప్రత్యణువులో ప్రతిధ్వనిస్తూ, పగవాడి కోట గోడ పునాదులే పెకలిద్దాం.

కన్నతల్లి కన్నీళ్ళు కార్చినచోటే శత్రు శిరస్సు నరికేద్దాం. నవజగత్తు నిర్మిద్దాం.

# షావుకారు సుబ్బయ్య

## శ్రీ కొడవటిగంటి కుటుంబరావు

"యాభై ఏళ్ళ కిందట మా వూళ్ళో కోమటి దుకాణం లేదు" అన్నాడు బావ.

చిట్టి కిల కిలా నవ్వి, "కోమటికొట్టు లేకపోతే పిప్పరమింటులూ, బిస్కట్లూ ఎవర మ్మేవాళ్లు ?" అన్నది.

"పిప్పరమింటులూ, బిస్కట్లూ ఎక్కడివీ ? అవీ ఉండేవి కావు" అన్నాడు బావ.

"కోమటికొట్టు లేకపోతే ఉప్పూ, పప్పూ, చింతపండూ ఎక్కణ్ణించి వచ్చేవీ ?" అన్నాడు బుల్లాడు.

"బళ్ళమీద రాసులుపోసుకుని తెచ్చే వాళ్లు. ఏడాదికి సరిపడా అందరూ కొనుక్కునేవాళ్ళు" అన్నాడు బావ.

"అంత పెద్ద ఊరు గదా, మీ ఊళ్లో అన్ని కాఫీహోటళ్లున్నయ్యే. ఒక్క కోమటి దుకాణం లేదా ?" అన్నాడు బుల్లాడు నమ్మలేకుండా.

"అప్పటి కింకా మా ఊరి మీదిగా రైలు లేదు, ఊరుకూడా చాలా చిన్నది. కాఫీహోటళ్ళు లేనే లేవు. అట్లా వుండగా మా ముత్తాత గారి పెళ్లి అయింది" అన్నాడు బావ.

"మీ ముత్తాత పెళ్ళికి పల్లకీ ఎక్కాడా ?" అన్నది చిట్టి.

"ఎందు కెక్కడూ ? మా ముత్తాత చిన్న జమీందారు. దాదాపు ఊళ్ళో పొలాలన్నీ ఆయనవే" అన్నాడు బావ.

"హి హి హి ! ముసలాళ్ళు పల్లకీ ఎక్కుతారా ?" అన్నది చిట్టి.

"పెళ్లికి మా ముత్తాత బుల్లాడికంటె కొంచెం పెద్దవాడు" అన్నాడు బావ. చిట్టి నవ్వటం ఆపింది.

"ఆ పెళ్ళికి —" అని బావ ఏదో చెప్పబోతుంటే బుల్లాడు అడ్డం వచ్చి, "ఆ పొలాలన్నీ ఏమైనయి బావా ?" అన్నాడు.

"అక్కడే ఉన్నై. ఇంకా పెరిగినై కూడానూ" అన్నాడు బావ.

"అవన్నీ యిప్పుడు నీవేనా ?" అన్నాడు బుల్లాడు.

"కావు మా ముత్తాతకు ముప్ఫయి మంది మునిమనమలం" అన్నాడు బావ.

"ఆ పొలంఅంతా పంచుకున్నారా?" అన్నాడు బుల్లాడు.

అందులోనూ ఒక్కొక్కనికీ నూరో వంతుకూడా రాలేదు. చెబుతా వినండి- మా ముత్తాత గుడికట్టించి, గుడికింద కొంతపొలం ఇచ్చేశాడు. ఊళ్ళో ఒక మంగలివాణ్ణి ! ఒక చాకలివాణ్ణి ! ఒక కుమ్మరిని ! ఒక కమసాలివాణ్ణి ! పెట్టి వాళ్ళందరికీ తలారెండెకరాలూ యిచ్చే శాడు. బీదబ్రాహ్మలందర్నీ చేర్చి వాళ్ళకి భూదానం చేశాడు" అన్నాడు బావ.

"మీ ముత్తాత చాల మంచివాడే" అన్నది చిట్టి.

ఆయన ఊళ్ళో ఒక బోగందాన్ని కుడా తెచ్చిపెట్టి దానికి యాభై ఎకరాలు రాసిచ్చాడు. ఒక రెండంతస్తుల మేడ కుడా కట్టించి పెట్టాడు" అన్నాడు బావ.

"ఎబ్బే! మీ ముత్తాత చెడ్డవాడు" అన్నది చిట్టి ఆముదం తాగిన మొహం పెట్టి.

"వినండి!" అన్నాడు బావ. మా ముత్తాత పెళ్ళికి సరుకులందించటానికి గాను ఒక కోమటిని నియమించారు. ఆ కోమటి దక్షిణాదివాడు. మా ముత్తాత పెళ్ళి చాలా వైభవంగా జరిగింది."

"ఎన్ని వేలు ఖర్చుపెట్టారు?" అన్నది చిట్టి.

"ఒక వెయ్యిరూపాయలు ఖర్చయి ఉంటై" అన్నాడు బావ.

"ఇంతేనా? నీ పెళ్ళికే నాన్న వెయ్యిరూపాయలు ఖర్చుచేశాడు గదా!" అన్నది చిట్టి.

"అప్పటి రోజుల్లో వెయ్యిరూపాయలంటే చాలా ఎక్కువ. పట్నం నుంచి నూరు రూపాయల మందుగుండు సామాను తెచ్చారు. సదస్యం నాడు అయిదువందల రూపాయలు సంభావన ఇచ్చారు. గృహప్రవేశం నాడు వెయ్యి మంది భోజనాలు చేశారు. ఇదీ పెళ్ళి కొడుకు వారివేపు ఖర్చు. రెండువేపుల వాళ్ళకి కావలసిన బట్టలూ, నగలూ, సరుకులూ సమస్తమూ కోమటాయనే కొన్నాడు. ఈ పెళ్ళిలో కోమటి బోలెడంత డబ్బూ, వస్తుసామగ్రీ, బట్టలూ, బంగారమూ కూడా వెనకేశాడు. ఇది పెట్టి ఆయన మా ఊళ్ళో చిన్న చిల్లర దుకాణం పెట్టాడు. మొదట్లో ఈ చిల్లర దుకాణం ఊళ్ళో ఉండే అలగా జనానికి ఉపయోగపడింది. వాళ్ళుకొనే దమ్మిడీ చింతపండులోనూ, దమ్మిడీ మిరపకాయల్లోనూ, దమ్మిడీ ఉప్పులోనూ కోమటికి సగానికి సగం లాభం.

"కోమటికి పెద్ద గిరాకీ ఏమిటంటే మా ముత్తాత ఉంచుకున్న బోగంది. ఆవిడ రకరకాల చీరెలూ, నగలూ, అగరు వత్తులూ, అత్తర్లు కోమటి ద్వారా తెప్పించుకునేది. వీటిల్లో కోమటి మంచి లాభం చేసేవాడు. ఇదిగాక కోమటి చిన్న చిన్న రైతులకూ వాళ్ళకి కొట్లో ఖాతాలు పెట్టేవాడు. తప్పుడు లెక్కలు రాసేవాడు. పంట రాగానే ధాన్యం కొలుచుకునేవాడు. డబ్బు తీసుకొనకుండా ధాన్యం కొలుచుకొనడంలో కోమటికి మరింత లాభం ఉండేది. ఆ రోజుల్లో కొమటిని ముష్టివాణ్ణి చూసినట్టు చూసేవాళ్లు. ఎందుకంటే అందరి దగ్గర వినయ విధేయతలుగా ఉండి చెయ్యిచాచి అడిగి న్యాయంగా రావలసిన దానికన్నా ఎక్కువ పుచ్చుకునేవాడు.

"మా తాతగారి కాలంనాటికి కోమటి ముసలాడైనాడు నాలుగైదు వేలు పోగుచేశాడని చెప్పుకునేవాళ్ళు. కాని ఆ ఎప్రపంచె తప్ప కట్టేవాడుకాడు. ఆయన కిద్దరు కొడుకులు. పెద్దవాడు బళ్ళసరుకులవ్యాపారం ప్రారంభించాడు. బెల్లమూ, చింతపండూ, కందా, పెండలమూ, ఉల్లిపాయలూ — ఇటువంటివి తానే తెచ్చి ఊళ్లో అమ్మినంత అమ్మి మిగిలినవి దుకాణంలో పెట్టించి తమ్ముడిచేత అమ్మించేవాడు. ఊళ్ళో

ధాన్యంకొని బస్తీకి పట్టుకెళ్ళి మరపట్టించి అక్కడే అమ్మేసేవాడు. చిన్నవాడు సన్నసన్నగా వడ్డీవ్యాపారాలు ప్రారంభించాడు. రోడ్లు కాస్త మంచివి పడేటప్పటికి మావూరు పెరగటం మొదలుపెట్టింది. ఊళ్ళో కాస్త కలవాళ్ళు ఒళ్లు తెలియని ఖర్చులుచేసి, ఆ తరాని కాతరము ఆస్తి పంపకాలమీద తరిగిపోతూ ఉన్న కొద్దీ దాయాదుల తగాదాలు పెంచుకొని కోర్టులకెక్కి ఉన్నదికూడా తగలేసుకోవటం మొదలుపెట్టారు. కుటుంబాలు పెరుగుతున్నకొద్దీ వ్యవసాయంమీద బతకటం కష్టసాధ్యమై చదువులకూ, ఉద్యోగాలకూ ఎగబడవలసివచ్చింది. ఊళ్లో రైతులుపెరిగారు. మధ్యతరగతిలో ముందాలోచనలేని మూఢులు తమ తదనంతరం పిల్లలేమవుతారో అనే ఆలోచనైనా లేకుండా రెండు చేతులా అప్పుచేసి జూదాలాడి, ముండలకు పెట్టి ఒళ్ళూపై తెలీకుండా ఖర్చుచేసేశారు ఇదంతా కోమటికి చాలా లాభించింది. కోమటి బిడ్డలు పెద్ద వ్యాపారస్తులేకాక వడ్డీ వ్యాపారస్తులుకూడా అయినారు. బీద రైతులందరూ వాళ్ళ బాకీదార్లే, ఊళ్ళో పెద్ద కుటుంబాలన్నీ వాళ్ళకి రుణపడ్డవే.

"మా తాత తనకు వచ్చిన ఆస్తిలో ఒయిదోవంతుకూడా పిల్లలకి దక్కనివ్వలేదు. మీరు చెబితే నమ్మరు, మా తాతకు దస్కతు చెయ్యటంరాదు. తన పిల్లలకింత చదువన్నా చెప్పించలేదు. మా నాన్న మెట్రిక్యులేషనుదాకా చదివి తాలూకా ఆఫీసు గుమస్తాగా చేరాడు. అందరూ తలోదారీ అయినారు.

"మావూరి కోమట్లుకూడా తలోదారీ అయినారు. ఒకడు పట్నంలో నగల వ్యాపారం చేస్తున్నాడు. మరొకడు గుంటూరులోపొగాకువర్తకుడు. ఇంకోడు బెజవాడలో బియ్యం మరలు కంట్రాక్టు తీసుకొని కనపడనిలాభాలు తీస్తున్నాడు. మావూరికిమాత్రం సుబ్బయ్య మిగిలాడు. సుబ్బయ్య తండ్రి పాతిక వేలు పెట్టి మావూళ్లో బ్రహ్మాండమైన మేడ కట్టించాడు. దాన్ని అద్దాల మేడ అంటారు. సుబ్బయ్య తండ్రి మొన్నమొన్నటిదాకా చెప్పతరంగాని వడ్డీ వ్యాపారం చేశాడు. అన్నీ మార్వాడీ వడ్డీలు. బీదవాళ్ళకిచ్చే తక్కువ మొత్తాలమీద ఎక్కువవడ్డీలు. ఎందరి కొంపలు తీశాడో తెలీదు. ఊళ్ళో పది పన్నెండిళ్ళు కొన్నాడు. అయిదారు సొంతాన కట్టించాడు. మా వూరికి మునిసిపాలిటీ వచ్చినతరవాత సుబ్బయ్య తండ్రి లేకుండా పురపాలకసంఘంలేదు అట్లాకూడా డబ్బుదోచాడు.

"సుబ్బయ్యా, సుబ్బయ్య మేనత్త కొడుకు బంగారయ్యా, మా బాబాయీ కలిసి చదువుకున్నారు. 1921 లో గాంధీఉద్యమం వచ్చినప్పుడు మా బాబాయీ బంగారయ్యా కలిసి చదువులు మానేసి ఖద్దరువేసుకున్నారు. సుబ్బయ్య మట్టుకు అందులో చేరలేదు. బంగారయ్య మాటేమోగాని మా బాబాయి తన కున్నకాస్త ఆస్తీ తగలేసుకున్నాడు. సుబ్బయ్య తండ్రి చేసిన వడ్డీవ్యాపారం అందుకున్నాడు 1930 లో మా బాబాయి సుబ్బయ్యను అడిగాడు. ఈసారన్నా ఉద్యమంలోకి వస్తావా అని. సుబ్బయ్యా, మాకు ఉద్యమాలెందుకు, బాబూ?

పెద్దలు మీరంతా ఉన్నారుగా, ఉద్యమం నడపండి మీవెనక మేమూ ఉన్నాం లే అన్నాడు.

"కిందటిసారి కాంగ్రెసు ప్రభుత్వం వస్తూనే వడ్డీవ్యాపారస్తుల నడుము విరగ్గొట్టింది. డబ్బు కాటకంమూలంగా సుబ్బయ్య ఎన్నోలక్షల విలువైనఆస్తులు అంటగట్టుకుని లాభాని కమ్ముకున్నాడు కాని ఇప్పుడు కాంగ్రెసు తన పొట్టమీద కొట్టిందని కాంగ్రెస్‌ను దుమ్మెత్తిపోశాడు. మా బాబాయికీ సుబ్బయ్యకూ ఓనాడు పెద్దయుద్ధమయింది కూడాను

"కాంగ్రెసు పదవిలోకి వచ్చేవరకు సుబ్బయ్య అటు ప్రభుత్వోద్యోగులను ఒకకంట కనిపెట్టే ఉన్నాడు: కాంగ్రెసు పరిపాలన ప్రారంభంకాగానే గాంధీటోపీ ఒకటి సంపాదించి కొన్ని ఖద్దరుగుడ్డలు గూడా చేర్చాడు. ఇంటిమీద కాంగ్రెసు జెండాకూడా ఎత్తాడు.

"యుద్ధం వచ్చింది. యికనేం? సుబ్బయ్యపంట పండింది. ఖద్దరుటోపీ అవతల పారేశాడు. మంచిమంచి సూట్లు కుట్టించాడు. మద్రాసుచుట్టూ తిరిగాడు. ఆ అధికార్లను చూ చా డు. ఈ అధి కార్లను చూచాడు. ఏ వే వో కంట్రా క్టులు సంపాదించాడు. దొంగవ్యాపారస్తులతో చేరి లక్షలు సంపాదించాడు. ఒక కేసులో పట్టుబడి వెయ్యి రూపాయలు జరిమానాకూడా ఇచ్చుకున్నాడు

"యుద్ధం జ రి గి న కాలములో సుబ్బయ్య మా బాబాయికి చాలా సహాయము చేశాడు. కాని మా బాబాయికి సుబ్బయ్య చేసే పనులు రుచించేవికావు. బంగారయ్యతోకూడా మాబాబాయికి చెడిపోయింది. బంగారయ్యపోయి కమ్యూనిస్టుల్లో చేరాడు. అయినా మా బాబాయికి సుబ్బయ్యను చూస్తేకన్న బంగారయ్యను చూస్తేనే ఎక్కువ కోపంగా ఉండేది.

"ఇది ఇట్లా ఉండగా ఇంకో చిత్రం జరిగింది. మా వూళ్ళో వెంకయ్య అనే ఒక పెద్ద మోతుబరి ఉన్నాడు. డెబ్బై ఎకరాల ఆసామీ. ఆయన కొడుకువెళ్ళి కమ్యూనిస్టుల్లో చే రా డు. సుబ్బయ్య కొడుకూ వెంకయ్య కొడుకూ చిన్నప్పట్నుంచి స్నేహితులు. వెంకయ్యకొడుకు సుబ్బయ్య కొడుకును కాస్తా కమ్యూనిస్టుల్లో చేర్చాడు. ఈ సంగతి తెలియగానే సుబ్బయ్య కెక్కడలేని దుఃఖమూ వచ్చింది ఒక్కడే కొ డు కు. తను సంపాదించిన లక్షలన్నీ ఏం గాను? కొడుక్కు నయానా భయానా చెప్పి చూచాడు. లా భ ం లే క పోయింది. సుబ్బయ్య బంగారయ్యను తిట్టాడు, పని పెట్టుకుని వెంకయ్యనుకూడా తిట్టాడు. వెంకయ్య సుబ్బయ్యను ఓదార్చి, నా కొడుకూ చెడిపోయినవాడే న న్నే ం చెయ్యమంటావు. ఈకాలపు వెధవల కిట్లా పుట్టుకొస్తున్నది అన్నాడు.

"సుబ్బయ్య దొంగవ్యాపారం చేస్తున్నమాట ఊళ్ళో అందరికీ తెలుసు. కమ్యూనిస్టులు సుబ్బయ్య దొంగతనం పట్టుకోకపోవడం సుబ్బయ్య కొడుకు కమ్యూనిస్టుపార్టీలో ఉండటం వల్లనే అన్నారు.

"ఇంతలో ఒకరోజు ఒకచిత్రం జరిగింది. వెంకయ్య కొడుకు ఊళ్ళో బుర్రకథా, కూచిపూడి భాగవతమూ పెట్టిం

చాడు రైతులకోసం. అదిచూడటానికి వెంకయ్యా, వాళ్ళబలగం యావత్తు వెళ్ళారు. వెంకయ్యకూ కొడుక్కూ పడదుగనుక వెంకయ్య వెళ్ళడను కున్నారు కాని వెంకయ్య వెళ్ళాడు. అందర్నీ పిలుచుకునికూడా వెళ్ళాడు. కొడుక్కూ తనకూ తేడాలుంటే అవి తమ ఇద్దరిమధ్యనే. ఊళ్ళోవాళ్ళకి సంబంధం లేదు. ఊళ్ళోతన కొడుకు చేయించేది తనుచేయించేదే. వెంకయ్య పెత్తనం మీదేసుకొని పందిరి కట్టించాడు. వచ్చిన వారికి కూచునే సదుపాయాలు కూడా మధ్యాహ్నంనుంచి చేయించాడు.

"ఈసంగతి తెలసి సుబ్బయ్య అనుకున్నాడుగదా, నేనూ నాకొడుకుతో పైకి సఖ్యంగానే ఉంటాను. వెంకయ్యకు కొడుకుతో లేనిపేచీ, నాకొడుకుతో నాకెందుకు ? వాడడిగితే డబ్బుకూడా యిస్తాను. వాడిపెళ్ళి వైభవంగాచేస్తాను" అనుకున్నాడు.

"ఆరేత్రే అటుబుర్రకథ జరుగుతున్న సమయంలో ఇటు కమ్యూనిస్టు కుర్రవాళ్ళు సుబ్బయ్య దొంగతనం పట్టుకున్నారు. పట్టుకున్నవారిలో సుబ్బయ్య కొడుకుకూడా ఉన్నాడు. సుబ్బయ్య కొందరు రౌడీలను దొంగమార్కెటు సరుకువెంట కాపలా ఉంచాడు. ఒకరౌడీ సుబ్బయ్య కొడుకునెత్తిమీద కర్రపెట్టి బలంగా కొట్టాడు ఇంతలో మిగిలిన వాళ్ళువచ్చి రౌడీని పట్టుకుని పోలీసులకు వప్పగించారు. పోలీసులు రౌడీని వదలివేశారు. సుబ్బయ్యమీద కమ్యూనిస్టులు పెట్టినకేసు ఎమయిందో తెలీదు

"సుబ్బయ్యకొడుకు ఇరవైరోజులు మంచంలోఉండి తెప్పరిల్లాడు. కొడుకు చస్తాడనే భయంతో సుబ్బయ్యకు మతిపోయింది. ఆఖరుకు కొడుకునుచూడటానికి వెళ్ళాడు. కొడుకు సుబ్బయ్యకేసి చూడలేదు. నువ్వెవరవో నేనెరుగను, వెళ్ళిపో అన్నాడు. సుబ్బయ్య ఏడుస్తూ ఇంటికొచ్చాడు" అని కథ పూర్తిచేశాడు బావ.

"అంతేకావాలి సుబ్బయ్యకు, అంతే కావాలి" అన్నది చిట్టి కసిగా.

"ఏవోకబుర్లలో ఉన్నారే ! అన్నానికి లేవ్వోయ్ !" అన్నాడు నాన్న.



# నిశ్రమణము

శ్రీ అనిశెట్టి సుబ్బారావు

కటిక రాత్రి :
కనుల నిదుర :
గడియారం గుండెనుండి
కాలం ప్రసవించు మూల్గు !

కలిమి లేమి సమరంలో
కాలం ఎర్రబడింది -
నరుల సిరుల గోరీ రాత్రి
పిడుగు పడిన
అడుగు విడిన
నావగ బ్రద్దలయింది !

కనులు పగులు
పట్టపగలు
మత్తు, మైకం, నిద్ర
మంచులా విడిపోయింది -
తాడిత భూవదనంపై
నీడ నిష్క్రమించింది !

సమధర్మం నిమ్నోన్నత
ములను కౌగలిస్తోంది -
సంగీతంగా కాలం
ప్రగతికి ప్రవహిస్తోంది !
గడియారం గుండెనుండి
ఆయాసపు నిశ్వాసం !

# పైపంట

## [జీవిత ఖండం]

శ్రీ నార్ల వెంకటేశ్వరరావు

— పాత్రలు —

| | | |
|---|---|---|
| రైతు | .... .... | కోమటి |
| భార్య | .... .... | షావుకారు |
| కొడుకు | .... .... | వెట్టివాడు |
| | కూతురు | |

స్థలం : రైతు యింటి చావడి
కాలం . వర్తమానం

ఎదురుగావున్న పడమటింటి ద్వారం పక్కగా కూర్చున్న రైతు భార్య - వయస్సు ౩౫ ప్రాంతం-బియ్యపు చేటను ముందుపెట్టుకుని, బెడ్డల్ని ఏరివేస్తూ వుంటుంది.

కుడివైపునున్న సింహద్వారం దగ్గరిగా కూర్చుని రైతుకొడుకు - ఈడు పద్ధెనిమిదో, పంధొమ్మిదో - గోగునారతో ఎడ్ల తలతాడు పేనుతూ వుంటాడు.

గుడ్డల దండెంతో, మంచాలతో, గెడం చితో, బుట్టల్లు, తట్టలు, నార, తాళ్ళు మొదలయినవాటితో చావిడి చిక్కిరొక్కిరుగా వుంటుంది. రైతు - ఇంచుమించు నలభై సంవత్సరాల వయస్సు-చుట్టకొల్చుకుంటూ, తలవాకిలిగుండా వస్తాడు. నీరుకావి ధోవతీ, నీరుకావి వుత్తరీయం, చొక్కాగాని, బనియనుగాని లేదు చంకలో కోలుపుకర్ర, కాళ్ళకు కిర్రుచెప్పులు.

తండ్రి ఈ వేషానికి కొడుకు వేషం భిన్నం. అతడివి నీరుకావి బట్టలుకావు. వొట్టి వొంటితోలేదు; ఒక ఆఫారం వేసుకున్నాడు. కాగా, రైతుభార్య పాతచీర కట్టుకున్నది. ముక్కున పుడకలు, ముఖాన కుంకుమబొట్టు, మెడలో మంగళసూత్రం : ఇవే ఆమె ఆభరణాలు.

కొడుకు - [ తండ్రి ప్రవేశించినంతనే ] బేరమిచ్చేశావటేఁ,

రైతు - ఆఁ

[ఒక మంచం వాల్చుకు కూర్చుంటాడు.]

కొడుకు — ఏకాడికి ?

రైతు - కానిదక్కువ పదణాలు.

కొడుకు - మరీ అంత తక్కువ కెందు కొదిలేశావేఁ అయ్యా ! పేటలో పన్నెండణాల పైచిలుకు పడుతున్నదట.

భార్య - మనకి మంచీ సెబ్బరా లేదుగాఁ. వాళ్ల ఏకాడికడిగితే, ఆకాడికి పారబోసి రావడమేఁ.

రైతు - చాల్లే, అఘోరించావ్ ! ఎక్కడా అప్పైనా పుట్టకపోతే, నన్నేం చెయ్యమంటావ్ ?

భార్య - పేటకు తోలుకుపోయి అమ్ముకు రాగూడదూ ?

రైతు - అమ్మకొచ్చేదాకా మునసబు ఆగొద్దూ? ఈ పూట కిస్తీ కట్టకపోతే, గొడ్లని జప్తు చేయిస్తాట్ట.

కొడుకు - రెండు కిస్తీలు కట్టలేకట్టాంగాఁ అయ్యా! మరొకటేగా బకాయి?

తండ్రి - ఏమైనా మరి ఆగడటరా! తెస్తావా, చస్తావా. అని ఎట్టాళ్ళని ఉరికిస్తున్నాడు. సందేళకి జమాబందీ పూర్తికావాలట.

భార్య - అయితే, శిస్తుకు సరిపడ రెండు మూడు బస్తాలమ్మి మిగతావి అట్టేపెట్టకపోయావూ?

రైతు - రెండు, మూడు బస్తాలకోసం, నీ యింటి కెవడొచ్చి కాటాకడతాడు? పైగా, మన మమ్మే పుట్లకిన్నిమాట్లు బేరాలు కూడానా?

భార్య - సరే, నీ యిష్టమొచ్చినట్టు చేసుకో - నాకు దేనికి? వెట్టివాడు [బయటి నుంచి] దొరోయ్, మునసబుగారు కూకేసుకు రమ్మన్నాడు.

రైతు - ఉఁ వొస్తున్నా. నువు పోరా!

వెట్టివాడు - నిలుచున్నపాళాన రమ్మన్నాడు మరి ఊరుకోడానికీల్లేదట.

కొడుకు - ఊరుకోకపోతే, ఉరెట్టుకోమను.

భార్య - ఆరి వీడి జిమ్మడ, కొంపమీదికి యములాళ్ళని తగిలినట్టు తగులుతున్నాడు.

రైతు - పదరా. పద. నీయెనకాలే వొస్తున్నానని చెప్పు.

వెట్టివాడు - [వెళ్ళిపోతూ] ఆ అయ్య నన్ను కొంపడతాడు, బేగిరా, దొరోయ్.

కొడుకు - ఈ మునసబు కరణాలు ఏం సవారిచేసినా, మనంటి పేదాబిక్కీమీదే అదే మోతుబరు ఆసాములనైతే, ఇట్టా దూకుడు చేస్తాడూ?

భార్య - వాళ్ళదగ్గిర పీళ్ళఅంకిలి నొక్కుకుపోతుంది నిరుడు మానానికి నిరుడుకూడా పీళ్లు పీకమీద కూర్చుండబట్టేగాఁ అయిన కాడికి తెగనమ్ముకున్నాం. తీరా మనం అమ్ముకున్న నెలకి బస్తాకి రూపాయి పెరిగింది.

కొడుకు - ఒక్కరూపాయి ఖర్మమేమిటేఁ అమ్మా? కార్తీకమాస మొచ్చేసరికింకా ధర పలికింది కాదటేఁ.

రైతు - ఇంతకి మన కమీషన్‌దారు బాగుపడేగీతుంది నిరుడు నిల్వబోసిన మూడు వేల బస్తామీద అయిదారువేలు కళ్ళజూచాడు. అందుకని, ఈయేడు మరీ తెగబడి కొంటున్నాడు.

భార్య - ఎన్నివేలు పోసుకోందే వాడి పెళ్ళాం మెడతిరగకుండా అన్ని నగలు చేయించి పెట్టుకుఁదీ?

కొడుకు - వాణ్ణిచూసి, మన షాహుకారు కూడా వడ్లబేరం ప్రారంభించాడేఁ అయ్యా.

రైతు - ఔనౌనురా; ఇందాక మనకి కబురెట్టాడు. వాడి ఆశకైతే అసలేఅంతులేదు తొమ్మిదణాలకాడికి తనకి కొలవాలట

కొడుకు - వాడి పుణ్యమాయిరి! ఎనిమిదణాల కాడికే అడిగాడుకాదు.

భార్య - ఆరి వాడి శిరసు పగల! పోసుకుంటున్న వడ్డీలు చాలవుకాబోలు! ఒక మేడకు మరొకమేడ కట్టాలని చూస్తునట్టున్నాడు.

రైతు - సర్లేరా, అబ్బాయ్! నాకు కాస్త బద్ధకంగావుందిగాని, నువ్వెళ్ళి కిస్తీకట్టిరారా. (బొడ్డునుంచి డబ్బుతీస్తూ)'ఒకయాభై సర్దరా' అని కమిషన్‌దారు నడిగితే. 'లేవే' అని, ఒక యిరవై మాత్రం బయాణాగాయిచ్చాడు ఇది కిస్తీకే సరిపోతుంది.

కొడుకు - (తండ్రి అందించిన పైకాన్ని తీసుకుంటూ)ఇంకా ఎంత కట్టాలేమేఁఅయ్యా!

రైతు - పదిహేను రూపాయల చిల్లరటరా.

కొడుకు - ఇంకా అంత దేనికేఁ?

తండ్రి - ఏవో సెస్సులట; జమాబందీ మామూళ్ళట.

భార్య - వాళ్ళ పాడె, వాళ్ళపిండాకూడు!

కొడుకు - మనకేం సాయితా చేస్తున్నారేమిటి? మనం మామూళ్ళివ్వడానికి.

రైతు - సర్కారు మడుపైనా తప్పుతుందేమోగాని, మామూళ్ళ ముడుపు తప్పుతుందట్రా? పల్లెపీధివాళ్ళు మామూళ్ళివ్వలేదనేగా, మునసబు కరణాలేకమై చురకతగిలించారు. వాళ్ళచేతికద్దేమిటి? వాళ్ళది వాళ్ళకి ముట్టచెప్పకపోతే, గండిసాగో గిండిసాగో అని పరపర రాసేస్తారు

భార్య - ఆ మునసబుకేమిటీయే కాలంగాని, మొన్న వృత్తి పుణ్యానికి సుబ్బమ్మత్త గేదల్ని బందెలదొడ్డికి తోలించాడు.

కొడుకు - ఎవరైనా మన మొంగినకొద్దీ, మరీ వొంగదీస్తారు. మామూళ్ళా గీమూళ్ళా మన మివ్వొద్దు, అయ్యా.

రైతు - వాళ్ళతో మన మెక్కడ గెలవగలం? మన కెందుకొచ్చిన పేచీలుగాని, ఆ మామూలేదో తగలేశేరా.

భార్య - చేసేరా - వాళ్ళ దెవసమేమో చేసేరా.

రైతు - [దణ్ణెంపైనుంచి పైపంచె తీసుకొని, మునసబు కచ్చేరికి బయల్దేరిన కొడుకుతో] వొస్తూ, కోమటింటికెళ్ళి. ఒక కాసీ పుగాకు తేరా అబ్బాయ్. కొస్త చూసి తే. బొత్తిగా నాసిరకమిస్తున్నాడు. నిలిచి కాలడమే లేదు

కొడుకు - సరే నయ్యా.

[వెళ్ళిపోతాడు]

భార్య - పొద్దున్నేగా ఒకకాసీది తెచ్చావ్! ఇళ్ళీ అప్పుడే కావాలీ? మన పుగాక్కి-చాలడంలేదు ఎంత డబ్బైనా!

రైతు - నువ్వెప్పుడూ నా పుగాక్కి- పడి ఏడుస్తూనే వుంటావ్. ఇవ్వాళ కొత్తేమున్నదిలేఁ?

భార్య - సర్లేఏది ఎలాతగలబడితే నాకు దేనికిగాని, నా కట్టుకోకలు చిరిగిపోయాయి. ఒక జత కొనకపోతే యికజరగదు.

కూతురు: [పడమటింటిలోనుంచి వస్తూ] బియ్యమేరకుం కానేలేదటేఁ అమ్మా?

భార్య - ఆఁ, వొస్తున్నా.

కూతురు - [చావడిలోకి వచ్చి] ఎసరు కాగిపోతోందేఁ అమ్మా.

భార్య - నా మాట చెవి నట్టించుకున్నావా ఇక అతుకు లెట్టుకుందామన్నా ఆగేలా లేవు. ఒక జత కోకలు ....

రైతు - చెముడింకా రాలేదు.

భార్య - సరే, తేబోకు. మనిప్పూసుకు తిరుగుతాలే.

[బియ్యపుచేట పుచ్చుకు విసురుగా లేచి వెళ్ళిపోతుంది.]

కూతురు - అయ్యా!

రైతు - ఏమమ్మా?

కూతురు - నిరుడు నువ్వు....

రైతు - ఆఁ, నిరుడు నేను —

కూతురు - నీకు గ్యాపకం లేదటే?

రైతు - [చిరునవ్వునవ్వుతూ] ఏమిటది?

కూతురు - పైపంటనాటికి నల్లపూసల గొలుసు చేయించి పెడతా ననలేదటేఁ?

రైతు - అయితే, యిప్పుడు చేయించమంటా వన్నమాట.

కూతురు - నువ్వే అన్నావుగా, అమ్మాఁ? పైపంట నాటికి చేయించి పెడతానని

రైతు - [నవ్వుతూ] మరి అన్నాక తప్పుతుందీ? అలాగే చేయిస్తాలే.

కూతురు - వెంకట్రావమ్మ పిన్నిగారి కోడలు చేయించుకుంది బాగా వుందే. అయ్యాఁ! మోస్తరు తెమ్మంటావా?

రైతు - తెద్దువుగానిలేఁ తొందరేమిటి?

కూతురు - అసలొకసారి చూడవేఁ ఎలా వుందో? నవర్సుమీద అయిదు చిన్నాలు పడిందట. కమలాచారి చేశాడు. మనం కూడా ఆ కంసాలిబత్తుడికే యిద్దామేఁ అయ్యా నేను వెంకట్రావమ్మపిన్నిగారింటికెళ్ళి రానటే?

రైతు - మంచిదమ్మా.

[కూతురు వెళ్ళబోతూవుంటే భార్య వస్తుంది].

భార్య - ఇప్పుడు వాళ్ళింటికి దేనికే ?

కూతురు - మోస్తరికి వాళ్ళకోడలు నల్లపూసల గొలుసు తెస్తానే. మా అయ్య నాకు చేయించి పెడతానంటున్నాడు.

[వెడుతుంది]

భార్య - అచేయించుకునేది నిరుడు చేయించుకున్నా బాగుండేది — నిడుడు బంగారము ఇంత మండిపోవడంలేదు. సరిగాని నా కోకలు.

రైతు - చెప్పినమాటే ఎన్నిసార్లుచెప్తావ్? తెస్తాలే, తెస్తా.

భార్య - ఆ నాయుడమ్మకొట్లోవి నాకొద్దు అవి మూడు రోజులైనా నిలవడంలేదు. పోసుకునే డబ్బు పోసుకుని, వొట్టి వలలాంటి గుడ్డల్ని అంటగడుతున్నాడు. వేరే ఎక్కడైనా కొనుక్కురా.

రైతు - వేరే కొనటానికి డబ్బేది ?

భార్య - అంతేలే నాకాడి కొచ్చేసరికి నీకు డబ్బే వుండదు.

రైతు - అదికాదే, సర్దవలసిన బాకీలన్నీ సర్దాక, మరేం మిగుల్తుంది ? ఆ నాయుడమ్మకిప్పుడు అమాంబాపతు ముప్పై దాకా యివ్వాలి. ఆ బాకీతీర్చి మళ్ళీ వాడి దగ్గిరే తెచ్చుకుంటే పైపంటదాకా ఆగుతాడు.

భార్య - దొరికాడులేఁ, మనకొక నాయుడమ్మ ఎక్కడలేని ధర వేసుకుని కొట్టు చీకుడు గుడ్డ లంటగట్టడానికి. వాడి జిమ్మడ. మరి వాడి కెలాదక్కుతుందోఁ, ఏమో.

కోమటి - [ప్రవేశిస్తూ] ఎవర్ని విన్నీ. శాపనార్థాలు పెడుతున్నావ్ ?

భార్య - అఁ, ఎవర్నీలేదు. ఎవర్ని అంటే ఎవ రూరుకుంటారు ?

కోమటి - [రైతుతో] ఎక్కడ బాకీ లక్కడ నిలిచిపోయాయేఁ బాబాయ్. మూడు రోజుల్నించీ ఎక్కే గడప, దిగే గడపేగాని రామరామ - ఎర్రటి ఏగాణైనా వసూలైతే వొట్టు ఊరుమీద అమాంబాపతు రెండు వేలెట్టి - నా ముఖం - నే నిక యాపారం చేసినట్టే.

రైతు - అఁ, రెండు, మూడు వేలు నీ కొక లెక్కా ? పత్రమా ?

కోమటి - నాయి ంట్లో సొమ్మంటే. బాబాయ్! ఎప్పటి కప్పుడు ఫిరాయింపు చెయ్యందే అక్కడ నా మొగు డూరుకుంటాడంటే ? మొన్న సరుకేసుకొద్దామనెళ్ళితే, నానామాట లన్నాడు. నువ్విప్పుడిస్తే, ఊరికే యిచ్చినట్టా. లెక్కైనా యిస్తావటే బాబాయ్ :

రైతు - పెద్దపెద్ద పద్దులు వసూల్చేసినా, చేసినందం. ముందు వాటిని.

కోమటి - బాబ్బాబు, నువ్వలా అంటే కాదు. చిల్లర శివాలచ్చి మన్నారు. కొంత కాకపోతే, కొంతైనా వసూల్జేసి సరుకేసుకు రాకపోతే, యాపారం బొబ్బుంటుంది. కొట్లో - రామ రామ - ఉప్పుంటే చింతపండు లేదు; చింతపండుంటే ఉప్పులేదు. ఏ వొట్టుపెడితే ఆ వొట్టు. చెయ్యిరగ గొట్టుకున్నట్టుగా వుందంటే నమ్ము.

భార్య - ఇంతకీ ఎం తివ్వా లేమిటి ?

కోమటి - (పద్దుపుస్తకం చూస్తూ) అఁ! వెరసి ఇరవై మూడు రూపాయల పన్నెండణాల కానీ అయిందేఁ విన్నీ.

భార్య - అంత యెచ్చవేమి మండబెట్టుకున్నాం ?

రైతు - నెల రోజులనా దొకసారి లెక్క జూస్తే, పదిహేనేగా యివ్వదేలాం ?

కోమటి - నే నగావ్ వేస్తున్నానటే. బాబాయ్! పద్దు పుస్తకం తేనే తెచ్చాగా. కావాలంటే, నువ్వే బేరీ చేసి చూసుకో.

రైతు - నాకుచదువొస్తే, కానికి మరొక కానీ నువ్వెలా రాసుకుంటావులే!

కోమటి - అరి నీయిల్లు బంగారంగాను! ఎంతమాటన్నావేఁ బాబాయ్. అవకాయ

పట్టుకోడానికిని మొన్నెగాదటే. మాపిన్ని రెండు వీసెల మంచినూనె, వీసెడు మిరప గాయలు వగైరా తెప్పించుకుంది? వీసె రెండుంబావలా చొప్పున రెండువీసెల మంచి నూనె..

రైతు - రెండుం బావలా వేసుకున్నావ్? పేటలో రెండు రూపాయలకాడికిస్తుంటే.

కోమటి - ఆఁ అక్కడైనా రెండుంబేడా అమ్ముతున్నారే బాబాయ్

భార్య - మరి ఆకాడికే మా కెందు కివ్వాలా?

కోమటి - ఆకాడి కిస్తే నాకెలా గిడు తుందేఁ పిన్నీ? కిరాయిలు పెట్టాలయ్యె! పడ్డీలు కట్టాలయ్యె, పారూ గీరూ పోతుం దాయె! నాకు వీసెకొక కాసీ, అర్ధణామిగిత్తే అక్కడి కవి పెద్దలాభాలే

భార్య - పోసుకో. ఇంకా పోసుకో,

కోమటి - ఆఁ, ఆ మాదేమున్నదేఁ పిన్నీ ఏడాదయ్యాక జమాఖర్చులెత్తితే శెట్టి మిగుల్తాడు. ఏమైనా రైతు రైతే. మంట్లో మానెడు, ఇంట్లో పుట్టెడు. [రైతుతో] ఏం బాబాయ్, మరి నన్ను పంపించవంటే?

రైతు - ఇంతకుముందే ఆ గింజలేవో వేర మిచ్చొచ్చా! రేపో, మాపోగాని పైకం చేతి కందదు. అందగానే. పదో, పరకో జమ కడతాలే.

కోమటి - బాబ్బాబు, దీనిలో మళ్ళీ కొంత బకాయి పెట్టొద్దు బాకీ చుక్తా చేసెయ్. కావాలంటే, మళ్ళీ వాడుకోవచ్చు. నీకు ఎప్పుడైనా నేను అడ్డుచెప్పానటే, బాబాయ్?

రైతు - మంచో, చెడ్డో, ఆ యిరవై మూడు రూపాయలిస్తాగాని, బాకీకి శ్రీరామ చుట్టు.

కోమటి - నాకైనా కొంత గుటక దిగొద్దటే, బాబాయ్? ఆ పైచిల్లర డబ్బులే నాకు మిగిలేది.

రైతు - అయితే, దమ్మిడీలతోసహా గోళ్లూడగొట్టి పుచ్చుకుంటానంటావ్!

కోమటి - నీ మాటెందుకు కాదనాలిగాని ఆ కాసీ తోసెయ్యవేఁ బాబాయ్,

భార్య - (కోమటితో) ఉఁ! మహాలావ్ చేశావులే ఎలాగైతేనేం మా కొక మష్టికాసీ రాయితీ! [రైతుతో] లెక్కా డొక్కా తిన్నగా చూపించి మరీయిచ్చు! ఎంతంటే అంతా యిస్తావేమిటి! మరి నే పోవాలి. అన్నా మేమైపోయిందో

కోమటి - కావాలంటే, నీ యిష్టమొచ్చిన వాళ్ళచేత పద్దు చూపించుకునే యివ్వవే, బాబాయ్, ఇందులో తబా బేమున్నది? మరి నన్ను వెళ్ళి రమ్మంటావా?

రైతు - ఊఁ.

కోమటి - [వెళ్ళిపోతూ]. నా మాట మర్చిపోబోకేఁ, బాబాయ్. పోనీ, నన్నే రమ్మంటే, మళ్ళీ రేపు...

రైతు - మళ్ళీ నువ్వు దేనికిలే? నే నే వొస్తా.

కోమటి - సర్లేవేఁ బాబాయ్! [తలవాకిలి వైపుకు చేరేసరికి, ఎదురుగా వస్తున్న షాహుకారును చూచి] కోమటి నెదురొచ్చానయ్యా. నీకు కోటి లాభాలు.

షాహుకారు - ఆఁ! అన్ని లాభాలుగానే వున్నాయ్!

కోమటి - నీ కేం తక్కువయ్యా? ఊరు మొత్తం మీద పెద్దషాహుకారువు ఇంట్లో లచ్మి మూలుగుతున్నది. రైతుతో మరి నే నెళ్ళొస్తానే, బాబాయ్. మర్చిపోబోకేఁ, నా మాట.

[ వెళ్ళిపోతాడు ]

రైతు - రావయ్యా, రా, కూర్చో.

సాహుకారు - ఆఁ కూర్చోడానికి రాలేదు లేఁ.

రైతు - ఏఁ? ఇలా దారి తప్పొచ్చావ్?

షాహుకారు - వాడికే బేరం ఫైసల్ చేశావటగా?

రైతు - మరి ఏం చెయ్యమంటావయ్యా? ఒక పక్కని వాడు కాని తక్కువ పదణాలకి అడుగుతున్నాడయ్యె. చూస్తూ, చూస్తూ నీకు

తొమ్మిదణాలకే ఎలా వొదిలిపెట్టమంటావ్?- నువ్వే చెప్పు?

షాహుకారు - వాడు బస్తాకి 170 పౌన్లు ఖచ్చితంగా తూసుకుంటాడు ముక్కానీ పెచ్చిస్తున్నాడట నువ్వు ఎగిరి గంతేశావే గాని, నాలుగు పౌనులు ఎక్కువ తూసుకుంటాడని పారజూసుకున్నావ్?

రైతు - ఏమో, ఆ మాయమర్మాలన్నీ నాకేం తెలుసు?

షాహుకారు - సర్లే! నువ్వు ఎవరికి బేరమిచ్చుకుంటే నాకు దేనికిగానీ, నా నోటు బాకీ నాకు పూర్తిగా తీర్మానం చేసెయ్యి

భార్య [పడమటింటిలోనుంచి వస్తూ షాహుకారుతో] - ఏం మన్నయ్యా! అంత కోపం చేసుకుంటున్నావ్?

షాహుకారు - కోపం లేదు: తాపంలేదు! నాకిప్పుడు పైకం అవసరంగా కావాలి.

రైతు - అంతా ఒక్కదఫా తెమ్మంటే, నే నెక్కడ తెస్తానయ్యా?

షాహుకారు - ఏం? మీ కమిషన్ దారున్నాడుగా?

భార్య - ఈసారికి అయిందేదో అయిపోయిందిలేం అన్నయ్యా. పై పంట నీకే తోల్తాంలే

షాహుకారు - నాకేమీ తోలొద్దులే. నా బాకీ అసలుఫాయిదాలు నాకు పారెయ్యండి

భార్య - మరీ అంత నిక్కచ్చి చేస్తావేమిటే'. అన్నయ్యా?

షాహుకారు - మీరు చెయ్యలా నిక్కచ్చి బేరం?

రైతు - అయితే, నువ్వు ముందే వొప్పుకో లేదటయ్యా, ఏటికి యాభైకాడికి చెల్లుబెట్టుకుంటానని

భార్య - నిరుడు, ముందటేడు పంటమ్మకోగానే, అత్తారబత్తంగా నీకుడబ్బు తెచ్చివ్వలేదటేం అన్నయ్యా? ఈ యేడుకూడా .

షాహుకారు - ఈ వాయిదాలు,గీయిదాలు నాకిక పనికిరావ్. నన్ను మీరు ఖాతిరీ చెయ్యనప్పుడు, నాకు మీ లావేమిటి?

రైతు - ఏం? ఏ యేటి వొడ్డీ ఆ యేడే పుచ్చుకుంటున్నా నొప్పేనా?

షాహుకారు - నీవడ్డీ డబ్బుల కెవ్వడు వానిలేడు రేపీపాటికి దస్తు తెస్తేనే తెచ్చావ్ లేకపోతే దావా వడేస్తా. తర్వాత నీ యిష్టం.

రైతు - కోర్టు కెక్కించాలని అంత ముచ్చటిగా వుంటే యెక్కించవయ్యా!

షాహుకారు - ఒక్క కోర్టుగాదు; ఏటికేడు పధ్నాలుగు కోర్టులెక్కిస్తి. నీ అంతు కనుక్కోక పోతానా? నీకు ఏ కమిషన్‌దారు అడ్డుపడతాడో చూస్తానుగా!

[విసురుగా వెళ్ళిపోతాడు. ఒక క్షణం పాటు రైతు, భార్య నిశ్చేష్టులై వుంటారు]

భార్య - అరి వీడి సిరి మండ, ఎట్టాగైతే పెట్టా డప్పు?

రైతు - తనడిగినకాడికి గింజలు పారబొయ్యలేదని వీడి కెంత గుర్రొచ్చింది. ఈ రెండు మూడేళ్ళనుంచీ, వీడి కేం పనివచ్చినా మనం హాజరుగా నిలబడ్డామనే విశ్వాసమైనా వుందేమో చూడు?

భార్య - వాడిదెవసం చేశారులేం, మొన్న మానూలులో పాడిగొడ్డుకుద్దా తోలికెళ్ళి కుప్పలు తొక్కించుకో లేదూ? మాయదారి కుమ్మ కరగడైపోతుంది గాని, వాడి డబ్బు వాడి మొఖాన గిరగిర తిప్పికొట్టు. ఇంకెంతివ్వాలి? మహా అయితే నూట యాభయ్యేగా?

రైతు - కాదే! వాడ మడతవడ్డీతో చేరి నూట డెబ్భైదాకా దేకుతుంది. పంటమ్మినదంతా వాడి యెదాన పెడితే, మిగతా చిల్లర మల్లర బాకీల మాటేమిటి?

భార్య - ఉం! అంతగా అయితే, పిల్లదాని చేతి గాజులు కుదవ బెట్టుకుందాంలే,

రైతు - దాని కింకొక వస్తువేదైనా ఏర్పరచడం లేకపోగా, అవికూడా కుదవ బెట్టుకుని మొండి చేతుల్తో ఎలా నిలబెడతామే?

భార్య - అం,ఇబ్బం దొచ్చినపుడు మరేం చేస్తామేమిటి? ఇప్పుడు అడ్డం వేసుకుని అది అత్తారింటికెళ్ళేనాటికివొదిలించివ్వొచ్చు.

రైతు - సరే! ఏదో ఒకదారి చూద్దాంలే.

వాడిది తాసుపాము పగ. మొత్తం బాకీ చెల్లి బెట్టకపోతే, వాడు కోర్టు కీడవక మానడు.

కొడుకు - [ప్రవేశిస్తూ] ఏమిటయ్యా? కోర్టేమిటి?

భార్య - వాడి యెఱుగు మండ! వాడడిగిన కాడికి గింజ లివ్వలేదని మొత్తం నోటు బాకీ యిప్పుడే కక్కమంటున్నాడురా!

రైతు - రేపీపాటి కివ్వకపోతే దావా పడేస్తాట్ట.

భార్య - ముప్ప తిప్పలుపెట్టి మూడు చెరువుల నీళ్ళు తాగిస్తాట్ట!

కొడుకు - ఎంత హజం!

రైతు - డబ్బునుబట్టే హజం.

భార్య - నడమంత్రంగా ఈనా డొచ్చాయిలే వీడికి నాలుగు డబ్బులు. చెడి బతక బట్టే కిందూ మీదూ కానడంలేదు.

కొడుకు - మరి ఇప్పుడేం చేస్తావే. అయ్యా?

రైతు - తల తాకట్టు పెట్టయినా వాడి బాకీ తీర్మానం చెయ్యాల్సిందేరా, కసిపట్టాడు వాడిక నిలవడు.

కొడుకు - పీడ వొదుల్తుంది. వాడిది వాడికి పారెయ్యవే. మనకి ఎలాగైతే తనే రెండు, మూడొందలు అప్పెట్టాగదా అని పెద్ద పాలేరులా నన్ను పనిలో నిలబెట్టుకుంటున్నాడు. ఊడిగం చెయ్యడానికి వీడు మనకి ఉచ్చితార్ధంగా యిచ్చాడేమిటి? అంతకంత పుచ్చుకోడూ?

[ కోపంకొద్దీ భుజంమీదున్న పై పంచెను విసిరి నేలకు కొడతాడు దాని చెరగున మూట కిట్టివున్న మువ్వలు గణగణ మ్రోగుతాయి. ]

భార్య - మువ్వ లెక్కడివిరా?

కొడుకు - కంచర లింగయ్యొచ్చి, నడీధిలో దేకావేశాడే, అమ్మా. సీతన్న కొనుక్కుంటుంటే నేనూ మన యెడ్లకని సరదా పడ్డానే. ఇఖ, ఇప్పుడేం చేస్తాం? వాపసిచ్చొస్తా.

[ మువ్వల మూటను అందుకుంటాడు. ]

రైతు - ఉంచుకో అబ్బాయ్. డబ్బు పైపంటనాటి కివ్వొచ్చులే.

కొడుకు - ఆఁ! వాడికి రొఖ్ఖం కావాలటే. పై యేటికే కొనుక్కుంటాలే. ఇప్పుడొచ్చిన తొందరేమిటి? (వెళ్ళబోతాడు)

రైతు - శిస్తుకట్టావట్రా?

కొడుకు - ఆఁ! మర్చేపోయా? ఇదుగో రసీదూ, మిగతా డబ్బూను. (రైతుకు వాటిని అందిస్తాడు.)

భార్య - ఎంత కట్టుకున్నారురా?

కొడుకు - అణా తక్కువ పదహారు.

రైతు - అంతదాకా దేకించారటరా?

కొడుకు - అహాఁ! పట్టాకి రూపాయి కాడికి ఈ యేడు జమాబందీ మామూలు వసూలు చేస్తున్నారట: తిన్నకొద్దీ వాళ్ళకి ఆక లెక్కవౌతున్నది!

భార్య - తిననీ! ఇంకా తిననీ! ఇలా పీక్కుతిన్నవాళ్ళు ముందుకు రారులే!

కొడుకు - (కదిలి వెడుతూ) మరి నే వెళ్ళొస్తానమ్మా!

రైతు - ఆ కంచర లింగయ్యఅగడట్రా? పై పంటనాటికి ...

కొడుకు - ఉహుఁ! వాడు నిలవడు!

(వెళ్ళిపోతాడు)

భార్య - పిచ్చి తండ్రి! మూడేళ్ళనుంచి మువ్వలు మువ్వలని ముచ్చట పడుతుంటే, ఈనాటికైనా ఒకదారి లేకపాయె! తవ్వుకోవడం, పూడ్చుకోవడం-ఇదేసరిపోతున్నది.

రైతు - ఆదేవుడు చల్లని చూపుచూస్తే పై పంటతో మనచిక్కులన్నీ తీరిపోతాయిలేవే!

భార్య - దేవుడికేఁ! వాడు చల్లటిచూపే చూస్తున్నాడు. మనుషులే పీక్కు తింటున్నారు!

రైతు - ఆఁ! మంచిరోజు ఎప్పటికైనా కనబడక పోతుందటే! అన్నట్టు, అబ్బాయి పుగాకు తేనేలేదు, మర్చిపోయాడుకామాలు.

భార్య - తేకపోతే, ఇప్పుడేమీ మునుకుపోలేదులే!

రైతు - నీదంతా మప్రతనం గాని. నే నడిగేది రోజుకు కాసీపుగాకే కాదటే?

భార్య - ఆ కాసీలేకేగా ఈతిప్పలన్నీ!



(5)

కానీపెడితే, ఇంతకూరో నారో రాదూ? పూటపూటా పచ్చడిమెతుకుల కర్మందేనికి?

రైతు - సర్లే! రేపటినుంచీ మానేస్తాను లేవే!

భార్య - నీకు లేనప్పుడు నాకోసం మా నెయ్యడం దేనికిలే!

రైతు - అదేమైనాగాని, ఇఖ చుట్టముట్ట నుగా!

భార్య - [చిరునవ్వుతో] ఆఁ ఈమురిపె మెన్ని రోజులులే! కూడైనా లేకపోతే, నువ్వుంటావుగాని, చుట్టముక్క లేకపోతే

కూతురు - [నల్లపూసల గొలుసుతో హుటాహుటిగా ప్రవేశిస్తూ] చూడవేఁ! అయ్యో ఎంత నదరుగావుందో!

రైతు - ఔనమ్మా! బాగానేవుంది.

కూతురు - ఈ బిళ్ళచూడవే! కొట్టొస్తున్నట్టుగా లేదూ?

రైతు - ఔనమ్మా!

కూతురు - అయితే, నాకు తెల్లరాళ్ళొద్దు; ఎర్ర రాళ్ళు కావాలి.

భార్య - ఏ రాళ్లకైనా ఇప్పుడు డబ్బేదమ్మా?

కూతురు - ఊఁ! నువ్వు చెప్పొచ్చావ్‌లే మాలావ్. నాకు గొలుసొద్దుగాని నీకు కోకలు కావాలేఁ?

భార్య - ఈ యేటికి నాకిఖ కోకలు కూడానా? ఆ పాత గుడ్డలే గతి.

రైతు [కూతురితో] - ఇంత వెర్రిబాగుల దానివేమమ్మా! నీకు లేకుండా మీ అమ్మ తనకి కావాలంటుందా? నా మాట విను. పై పంట నాటికి....

కూతురు - ఐతే, ఇందాక నే నడిగితే....

రైతు - ఔను! ఈ పంటలోనే చేయిస్తానన్నాగాని, షాహుకారు తొందర చేస్తున్నాడు—వాడి బాకీ నిలపడానికీల్లేదట.

భార్య - అది తీర్చినా యింకా లేవూ తలమోపి డప్పులు.

కూతురు - [రైతుతో] అయితే. నాకు ఆశ ఎందుకు పెట్టావేమిటి?

రైతు - నాకుమాత్ర మేం తెలుసునమ్మా. వాడిప్పుడు గొంతుమీద కూర్చుంటాడని? మా తల్లివి కాదూ? నా మాట విను! తప్పకుండా పై పంటలో నీకు...

కూతురు - నా కే మొద్దులే!

భార్య - దారి లేనప్పుడు మరి ఆయన మాత్ర మేం చేస్తాడేఁ?

కూతురు - వాళ్ళందరిప్పుడు నన్ను నవ్వుతారు. గొలుసు చేయించుకుంటున్నానని—సిగ్గుచేటు—మోస్తరుకూడా తెచ్చా.

రైతు - లేదమ్మా, సత్తై ప్రమాణంగా నీకు పై పంటలో

కూతురు - ఆఁ! అన్నీ చేయిస్తావులే. నిరుడు మానానికి నిరుడిలాగే అనలా?

[కోపంగా చరచర పడమటింటిలోకి వెళ్ళిపోతుంది.]

రైతు - పిచ్చి సన్నాసి! గంపెడాస పెట్టుకున్నదేమో చెడ్డకోప మొచ్చింది. ఏమైనాగాని పై పంటనాటికి దానిముద్దు తీర్చాలి.

భార్య - [నిట్టూరుస్తూ] పై పంట. .పై పంట.. పై పంట... ఎక్కడిది పై పంట? కళ్ళన్నీ దానిమీద పెట్టుకోవడమే గాని. అది నోటిదాకా వొస్తేనా? కాకులు గద్దలు తన్నుకుపోయినట్టు చేతిలోదాన్ని చేతిలోనుంచే తన్నుకుపోతారయ్యో!

రైతు - ఏమైనా, లేదనుకోగూడదే! రోగం రొస్టూ లేకుండా రెక్కాడుతూవుంటే బండిని ఎలాగో దొర్లించుకుపోలేకపోతామూ?

[రైతు ఈమాట లంటుండగా "ఎందుకైనా త్రుంచినావూ బందిఖానాలో" అని పాడుకుంటూ తలవాకిలిలోకి ఒక రామదాసు బిచ్చానికి వస్తాడు]

భార్య - ఇక్కడ మేమేం అరబెట్టుకు కూర్చోలేదు. పో! పో!

రైతు - దేహీ అంటూ వాకిట్లో కొచ్చిన వాడిని కసిరికొట్టగూడదే! ఏదీ! లే! బద్ద కించబోకు నాలుగు గింజ లేసిరా.

[ఒక మూలగుమూలిగి భార్యలేస్తుండగా తెర]

# హాస్యం

శ్రీ మొక్కపాటి నరసింహశాస్త్రి

ఆదిని మానవునికి పశుప్రవృత్తి ప్రధానంగా ఉండేది. ఆహార నిద్రాదులతోనే జీవితం గడిచి పోయేది. కాని కాలక్రమాన అతనికి మనస్సు, బుద్ధిపూర్తిగ వికాసము పొందడము ప్రారంభించిన తరువాత, ఈయింద్రియ వ్యాపారాదులతో, మనస్సుకు సంతృప్తి కలిగించే ఆనందాన్వేషణలోకి దిగాడు మానవుడు. ఆ అన్వేషణా ఫలితమే సాహిత్యాది లలిత కళలన్నీని.

మానవ జాతి సంఖ్య పెరిగి, సంఘాలూ, రాజ్యాలూ ఏర్పడిన తరువాత దైనందిన వ్యాపారములు ఎట్లా సాధించుకోవలెనో, నిత్యజీవన మెట్లా దిద్దుకోవలెనో, మానవునికీ మానవునికీ, సంఘానికీ సంఘానికీ సంబంధ మెట్లా ఉండవలెనో, ఈమొదలైన విషయాలనుపదేశించడానికి సుహృత్సమ్మితములైన పురాణాదులను, అంతకంటె సున్నితంగా చెప్పవలసినప్పుడు కాంతాసమ్మితములైన కావ్యాలనూ సృష్టించారు. తద్రీత్యా ప్రజల మత ధర్మ నీతి వర్తనములనుతీర్చిదిద్ది సక్రమమైన మార్గాన్ని మానవ జాతిని నడప గలిగారు.

అందుచేతను సాహిత్యం కేవలం ఆనంద దాయకమే కాకుండా ఉపదేష్టగా కూడా ఉంటూవచ్చింది. ఈ ఆనందాన్ని ఎన్నోరెట్లు ఇనుమడింపచేసేవి, ఈఉపదేశాలను ఎక్కువగా హృదయానికి హత్తుకొనే టట్లు చేసేవి, కావ్యములకంటె ప్రజలనాకర్షింపచేసినవి నాటకాలు. సాహిత్యం ఈరూపాన్ని ధరించిన తరువాత దానిప్రయోజనం ఇంకా హెచ్చింది. ఉన్నత శిఖరాలనుంచి దిగి ప్రజా జీవితానికి సన్నిహితంగా వచ్చింది.

మానవజీవితంలో అజ్ఞాతంగా ఉన్న వెలుగునీడలను, మిట్టపల్లాలను హృదయ పరివర్తనలను, మనోవేదనలనూ ప్రజలకు ప్రత్యక్షంగా ప్రదర్శించి ప్రజామోదమును పొందగలిగినాయి ఈ నాటకాలు. సాహిత్యం ఈ రూపంలోనికి వచ్చినతరువాత హాస్యం ఎక్కువగా ఉపకరించేది దానికి. ఏమంటే ప్రజాకర్షణకు హాస్యంలాంటిదిమరొకటి లేదు. మానవులలో వుండే తారతమ్యాలు, వైపరీత్యాలూ, అందవికారాలూ అజ్ఞానాలూ, దౌర్జన్యాలూ బట్టబయలు చేయడానికి హాస్యం ఉపకరించేటట్లు మరే రసమూ ఉపయోగించదు. అందుకని నాటకం ఒక రూపాన్ని, పరిణామాన్ని పొందిన తరువాత, పురాణాల తరువాత కావ్యాలూ, వాటి తరువాత నాటకాలూ, వచ్చినట్లుగానే, రచయితలకు ప్రజలనానందింప జేయడమేకాక, ఒక్క అజ్ఞానమో, దౌర్జన్యమో, అహంకారమో అధికారమో ఆవహించిన వారిలోవుండే లోపాలు ప్రత్యక్షంగా చూపించి వారిని సంస్కరించవలెననే సదుద్దేశం కలిగిన

నాడు ప్రహసనాలు బయలుదేరాయి. కానయితే ప్రహసనం రంగస్థలంమీద ప్రదర్శించినప్పుడే దాని పూర్తి ప్రయోజనం కలుగుతుంది. ప్రేక్షకులకు దాని వలన కలిగిన ఆనందమే దానికి నిత్య యౌవనాన్ని, శాశ్వతత్వాన్ని కలిగిస్తుంది. కాని రచయిత తన ప్రతిభచేత రచనా కౌశల్యంచేత లలితార్థశబ్ద ప్రయోగం చేత తన తరంలో తన పాఠకులలో కలిగిన నవ్వును కొన్ని తరములవరకూ ప్రతిధ్వనింపజేయ గలిగినట్లయితే, అప్పుడు ఆ ప్రహసనం కేవలం ప్రహసనమే కాకుండా సాహిత్యం కూడా అవుతుంది.

ప్రహసనంయొక్క ప్రయోజనం ప్రజలను ఖులాసాగా నవ్వించడమే అయినా, అంతకంటె ఉత్తమ ప్రయోజనంకూడా లేకపోలేదు. జీవితంయొక్క యధార్థ ప్రతిపాదన దాని ప్రథమ కర్తవ్యము. అప్పుడు మానవుని లోపాలు ప్రత్యక్షంగాప్రదర్శించి వాటిసంస్కరణకు మార్గములను సూచించడమే ప్రహసనంయొక్క పరమావధి అవుతుంది. అనగా నీతి పాఠానికీ, హృదయపరివర్తనకూ తోడ్పడమే గాకుండా సాంఘిక నైతిక వ్యావహారికాచారాలను ఘాటుగా విమర్శిస్తుందన్నమాట.

తెలుగులో మొట్టమొదటి ప్రహసనం 1881 లో కాబోలు బయలుదేరింది. ఆ నాడు కూడా ప్రబలంగా ఉండి ఉండాలి ఈ నియోగి వైదికి కక్షలు. అవి చూచి అసహ్యం పుట్టి వ్రాయబడిన దామొదటి ప్రహసనం. తరువాత శ్రీ వీరేశలింగం పంతులుగారు సంఘ సంస్కరణకు ప్రహసనాన్ని సాధనంగా ఉపయోగించిన వారిలో ముఖ్యులు, ప్రథములు అని చెప్పవచ్చును. వల్లభరాయుడు క్రీడాభిరామంలోనూ, శ్రీనాథుడు చాటువులలోనూ సాధించిన ప్రయోజనం కంటె పంతులుగారు తమ ప్రహసనాలవల్ల ఎక్కువ సాధించారని చెప్పక తప్పదు. వారి కాలంలో ఉండే దురాచారాలనూ, అవినీతినీ, అజ్ఞానాన్నీ అద్భుతంగా ప్రదర్శించారు వారి ప్రహసనాల్లో. దానివల్ల సంస్కరణ కూడా ఎంతగా సాగిందో ఒక్క విషయంవల్ల మనకు తెలుస్తుంది. లంచగొండి తనాన్ని గురించి ఒక తహసీల్దారుని పాత్రగా ప్రవేశపెట్టి ప్రహసనం వ్రాసి పత్రికలలో ప్రకటించేసరికి, ఆ తహసీల్దారు ఒకరాత్రివేళ పంతులుగారివద్దకు స్వయంగా వచ్చి, వారుద్దేశించిన మనిషి తానేనని, తన తప్పిదం మన్నించమని పంతులుగారి కాళ్ళు పట్టుకున్నాడట. ఈలాగే వేశ్యాలోలుడైన ఒక వకీలును గురించి, మూఢాచారాలతో అసలు విషయం మరచిపోయిన పండితులను గురించి, కవులను గురించి, పెళ్ళిళ్ళను గురించి ఎన్నెన్నో ప్రహసనాలు వ్రాసి సంఘ సంస్కారానికి పాటు పడ్డారు పంతులుగారు. కాని వారిలో సున్నితమైన హాస్యం తక్కువగా ఉండేది. ఆ లోటు తీర్చారు వారి సమకాలికులు, అనుచరులూ అయిన శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారు. ఉదాహరణకు వారి జనభా లెక్కల ప్రహసనం చూడండి. జనాభా లెక్కలు వ్రాయడానికి ఒక వార్డుకు ఒక

బ్రాహ్మణుడు (Enumerator) గా నియమింప బడ్డాడు. అతను ఒక నిరు పేద శూద్రకొంపకు వెళ్ళి బ్రహ్మాండం మీద ఆ గుడిసెలో వాళ్ళపేర్లు వగైరా వ్రాసుకున్నాడు. వారంరోజులైన తరువాత ఆఖరు రోజు రాత్రి ఇదిమళ్ళీ సరి చూచుకోడానికి వెళ్ళాడట. ఈలోపున ఆ ఇంట్లో ఒక చంటిపిల్లవాడు జారిపోయాడు. ఆ దుఃఖంలో ఉండగా ఇతను వెళ్ళి తలుపుకొట్టగానే తల్లి ఇవతలికి వచ్చి అన్నదట—

"నీ రాత మండిపోనూ, నాకొంపతీసి మళ్ళీ వచ్చావా—నీ కళ్ళు కాలిపోనూ—యే యేలప్పుడొచ్చావో, యే యేలప్పుడు సూశావో, నీ రాత నట్టేట్లో కలిసిపోను మాణిక్కమంటి పిల్లోణ్ణి నీ పొట్టనెట్టుకున్నావుకందా —మాయబాపనోడా — నీ లెక్కలు నేలమడా — నాయనోయ్ నాయనా — నాజీవాని కీపేర్లెక్కడొచ్చి నాయిరోయ్ తండ్రీ — యీబాపనోడు ఈ నా జీవానికెములోడయినాడురోయ్ తండ్రీ—ఆరి బాపనోడ — నిన్ను మావిళ్ళమ్మేసుకుపోనూ— నీ కేందుర్బుద్ధి పుట్టిందిరా. ఆణ్ణి చంపి ఈళ్ళనికూడా పొట్టనెట్టుకుందామని వచ్చావా? ఉండు నీజిమ్మడ అక్కడుండు రోకలుచ్చుకుని రొమ్ములో మొదుస్తాను...."

అమాయకులైన పాటకజనంలో ఉండే అజ్ఞానాన్ని ఇంతకంటె చక్కగా ఎలా ప్రదర్శించడం. వాళ్ళకు విద్యాదానం చెయ్యడం అవసరమని చెప్పడమూనూ.

ఇంకొక ఉదాహరణ. ఆరోజులలో చాలా దరిద్రస్థితిలో ఉండి నీళ్ళకావిళ్ళు మోసుకొనో, వంటచేసో పొట్టపోసుకొంటున్న బ్రాహ్మడు. తన కొడుక్కి నానాగడ్డీకరచి ఇంగ్లీషు చదువు చెప్పించాడు పిల్లవాడు B. A. లో ఉత్తీర్ణుడయ్యాడు అదృష్టవశాత్తు తహశీల్దారు అయ్యాడు దానితో అతని కళ్ళు మూసుకుపోయినాయి. తల్లిదండ్రుల యొక్క దారిద్ర్యం నైచ్యజీవనం అతనికి దుస్సహంగా కనపడింది. పోనీ వాళ్ళకు శుభ్రమైన బట్టలూ పాతలూ ఇచ్చి సుఖపెట్టడం ఇష్టం లేకపోయింది. బయిటకు పొమ్మనడానికి ధైర్యం లేకపోయింది. అందుచేతను ఇంట్లోనే ఉంచుకొని వాళ్ళచేతను అడ్డమైన చాకిరీ చేయించుకొంటూ ఉండగా ఒకరోజున ఎవరో గొప్పవారు తనింటికి అతిధులుగా వచ్చినప్పుడు తనతండ్రి తన ఇంట్లో వంటబ్రాహ్మడని చెప్పాడట. ఆ పెద్ద మనిషి మొన్నటి మొన్నటివరకూ బ్రతికే ఉన్నాడు. ఈ ప్రహసనం బయటపడ్డ తరువాత అతని జీవితాంతంవరకూ బాధ పడుతూనే ఉండేవాడట. అధికార మత్తత అలాచేస్తుంది కాబోలు.

ఒక గొప్పఇంటివారికి ఒక్కడే కొడుకు. ఆ పిల్లవాడయినా ఎక్కువ తెలివితేటలయినవాడుకాడు. 22 సంవత్సరాలుదాటినా మెట్రిక్యులేషన్ మట్టుకు దాటలేకపోయాడు. అతనికి పెళ్ళి చెయ్యవలెనని తండ్రికి ఆదుర్దాపుట్టింది. ఒక సిద్ధాంతిని పిలిచి — "చూడండి శాస్త్రుల్లుగారూ, మన వాడికి సంబంధమొకటి వచ్చింది. వాళ్ళు జాతకం కావాలంటున్నారు. మీరొకటి తయారు చెయ్యాలి. మావాడు ఎప్పుడు పుట్టాడో

జ్ఞాపకం లేదుగాని, మన్మథ సంవత్సరం అనుకుంటాను. మాసం మట్టుకు వైశాఖ మాస మని జ్ఞాపకం. తిధి వార నక్షత్రాలు అసలే జ్ఞాపకం లేదు. ఏదోమంచి తిధిచూచి గ్రహాలన్నిటినీ ఉచ్ఛదశలో పెట్టి అఖండయోగంపట్టే జాతకం వ్రాయండి. ఆ గ్రహాలు మన్మథలో కుదరకపోతే దుర్ముఖిలో పుట్టినట్టు వ్రాయండి"—అన్నాట్ట.

శాస్త్రిగారు-దుర్ముఖికాకపోతేహేవిళంబిలో పుట్టినట్టువ్రాస్తాను. ఇంకోరెండేళ్ళ వయస్సుకూడా తగ్గినట్టుంటుంది. గొప్ప ఇంటివారి కుమాళ్ళు పెళ్ళినాటికి చిన్న వాళ్ళుగా ఉండాలి, లేకపోతేయింతకాలం యెందుకు పెళ్ళికాలేదంటారు.

తండ్రి — బాగుంది బాబూ ఆలా చేయండి. అన్నివిధాలా గొప్ప జాతకమయి వుండాలి. ఆ హెడ్డు మేష్టరు ఈ ఏడు మావాడిని పరీక్షకు పంపనంటే మొన్నదరఖాస్తు పరీక్షకు క్రిందిమాష్టర్లనందరినీ పట్టుకునితలో పందుం ధాన్యం పడేసి మార్కులెక్క వేయించాను. హెడ్డుమాష్టరు చచ్చినట్టుపరీక్షకు పంపించాడు. మీజాతకంతో ఈసంబంధంకూడా కుదురుతే—అద్భుతమైనజాతకం తయారయింది. కట్నం చాలావస్తోందని క్షయరోగంతోడ ఉన్నపిల్లను పెళ్ళిచేశారు. నెలతిరక్కుండా ఆ అమ్మాయి పరలోకగతురాలయింది. మళ్ళీ 13 రోజులువెళ్ళకుండానే మరోసంబంధం చేశారు. ఈ ఒక్క ప్రహసనంలో రాఘవరావుగారి లుబ్ధత్వం, ద్రోహం, సిద్ధాంతి గారి కక్కుర్తి, మేష్టర్ల లంచగొండితనం, పిల్లలున్నవాళ్ళ ఆదుర్దా ఎంతోచక్కగా ప్రదర్శించి ఏడిపించారు వాళ్ళను. ఇటు వంటివింకా ఎన్నోప్రహసనాలు వ్రాశారు.

ఇంతకన్నా చక్కని హాస్యం రంపకోతలాంటి విమర్శన శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావుగారి ప్రహసనాల్లో కనిపిస్తుంది. వారు ఎన్నిసాంఘిక దురాచారాలను వేళాకోళంచేసి వెక్కిరించి, నవ్వించి, ఏడిపించి మానిపించవలెనని ప్రయత్నం చేశారోలెక్కలేదు. వారి సూక్ష్మదృష్టికి ఆననిలోపాలు, వారి తీవ్ర విమర్శనకు పాత్రంకాని తెలివితక్కువలు కానిలేవు. మనుష్యులు, సంస్థలు, ఆచరాలు, వ్యవహారాలు, డంబాలు, దర్జాలు, నీతులు, వ్రతాలు, ఒకటేమిటి ఉదాహరణకు ఒక్కటి చూపిస్తాను.

శని, రాహువులు ఒకచోట కలుసుకున్నప్పుడు, భూలోకంలో ఈ కలికాలంలో దైవభక్తి తగ్గినదనీ, దేవతలకే ధూపదీప నైవేద్యాలు లోపించాయని, జాతకాలు, గ్రహాలూ, గ్రహశాంతులూ మొదలైన వాటిలో నమ్మకాలు లేకపోవడంచేతను తమ కసలే ఏమీ లేదని రాహువు విలపించడం ప్రారంభించాడు. దానికి శని సమాధానం చెపుతాడు—

శని : నశించినదా, ఎక్కడ నశించినది, పాశ్చాత్య విద్యాభిమానులలో మాత్రం బ్రాహ్మసామాజికులలో మాత్రం పూర్ణముగ నశించినదా. వివ్యలదారివేరు ఆచరణదారి వేరు. సభలలో నుపన్యాసకులదారివేరు పైకి వీరు మనలను నిందించుచున్నను ఏడ్చుచునో మొత్తుకొనుచునో, చాటుననో, మాటుననో, మనకింత గుప్తదాన ధోరణిగ పడ

వేయుచున్నారుగాని మానిన వాడేడీ.... నాలుగుకీళ్ళు సరిగనాడినంత సేపు మనల నెవ్వరు తల పెట్టరు. మాధుకరపు సంచి చేతికొచ్చినప్పుడో మంచముమీద పడినప్పుడో అందరకొరకూ దేవులాడి నట్లే మనకొరకునూ దేవులాడుతారు.

అని శని, రాహువు నోదార్చాడట

మరొకచోట కవులూ, వారి ఆశ్రయింపు ధోరణీ, ప్రభువులూ వారికి కవులయందుండే నిరసనా చూపిస్తూ ఒక ప్రహసనం వ్రాశారు. అందులో ఒక కవి ప్రభువును వర్ణించిన వర్ణన బాగాలేదని కుపితుడై రాజు కవిని చావగొట్టి పంపిస్తాడు. దగ్గరున్న అనుచరుడు ప్రభువు చేసిన పనికి మెచ్చుకొని 'సెభాష్‌! ఏలిన వారు దేవతలు మెచ్చతగిన పనిచేశారు. దేశోద్ధరణమనగ నిదియే అని స్తోత్ర పాఠం చేశాడు. వెలమవారి డాబు, దర్పం, దర్జా, అహంకారం అనేకచోట్ల ఈయన హేళన చేశారు....

జయరామసింగుఅనెఒకరాజబంధువు ఒకకన్యను వరించబోతే ఆమె స్నేహితుడు వచ్చి తన్నుతానని బెదరిస్తాడు. జయరామ సింగు అంటాడూ — ఎందుచేతనూ — మనమేమి తప్పాడితిమా — మనము ఎప్పుడూ తగవులకు దిగువారము కాము సుమీ — పౌరషము లేక కాదు - దినమున కొక్క మేకమాంసము దినుమనకు పౌరుషముండ కేమి? పౌరుషమనునది పంటిశక్తిలో నున్నది పన్ను మొదలు కొండనాలుక వరకే పౌరుషతత్వము. అని ధైర్యంగా సమాధానం చెప్పాడట. ఆకన్య కాళ్ల పట్టుకోమంటే, మన కెంతమాత్రమూ అభ్యంతరమూ లేదు. మనకుకాళ్లుఒకటీ చేతు ఒకటీ కాదు అని దర్జాగా కాళ్లపట్టు న్నాగట

ఇంకో దొరగారు, తను సావిట్లో కూర్చునిఉండగా దాసీది వచ్చినిచ్చెనెక్కి గోడకు సున్నంవేస్తుంటే, తనకంటె దాసీదిపైగా ఉండడంవల్ల గౌరవహాని భావించి తొందరగా మరో నిచ్చెనెక్క బోయి పడిప్రాణాలు విడిచాడట. ఇం కంటె హాస్యాస్పద మేముంటుంది.

వీరిముగ్గురను మించినవారు గు జాడ అప్పారావుగారు. వీరి హాస్య బహు సున్నితమైనది. పూర్తి అయి పరిణతి పొందినది. వారికన్యాశుల్కంలో ప్రతి అక్షరం అందరకూ కంఠస్థవే గనుకనేను వేరే ఉదాహరణలు చూపించ నక్కర లేదనుకుంటాను.

ఆధునికులలో ఇంత సుప్రసిద్ధులూ, అనేక సంస్కరణలకూ ఉపదేశాలకూ హాస్యాన్ని ప్రహసనాన్ని సాధనంగా చేసుకున్నవారిలో ముఖ్యులు శ్రీ భమిడిపాటి కామేశ్వరరావుగారు, మల్లాది విశ్వనాధ కవిరాజుగారు.

ఇంతకూ నేను మనవిచేసిందేమంటే హాస్యం వల్ల అందులోనూ ప్రహసనం వల్ల సంఘ సంస్కారం సాధ్యమని. అంతే కాదు. అదే దాని పరమ ప్రయోజనమనీ కూడా నా అభిప్రాయం. అసలు ఒక వస్తువును గాని, మనిషిని కాని మనం చూచి నవ్వా మంటేనే, వారిలో ఉండే లోపాలను చూపించి వారిని సవరించపోవడమన్నమాట. ప్రహసనంలో మనుష్యుల నడవడులు, ఆచారాలు, పద్ధతులు ప్రదర్శింపబడతాయి. వారి

లోపాలూ, దర్జాలూ, దర్పాలూ, తెలివి తక్కువలూ, అవినీతులూ అన్నింటినీ అపహసించవచ్చును.

పిరికిపంద, డాంబికుడు, పండితమ్మన్యుడు, నీచుడు. వేషధారి, శుష్కవేదాంతి. ఇంకా ఇలాంటి వారెందరో ప్రహసనాల్లో నాయకులౌతారు. వారంతా మానవాదర్శానికి చాలా తీసిపోయిన వారు.

మానవజీవితంలో అనేక విషయాలు ప్రహసనానికి కథావస్తువులవుతాయి. కొందరి మాటల ధోరణి, కొందరి ఆచార వ్యవహారాలు, కొందరి మూర్ఖపు పట్టుదలలు, కొందరి మతసిద్ధాంతాలు, కొందరి రాజకీయాలు, ఒక జాతివారి దంభం, ఒక జాతివారి అహంకారం ఒకటేమిటి అన్నింటినీ ప్రహసనంలో ప్రయోగించి ప్రదర్శించి సంస్కరించ వచ్చును. అది అప్పారావుగారి హాస్యం వలె సున్నితంగా ఉండవచ్చును. లేదా పానుగంటివారి శూలంలాగ నేనా ఉండవచ్చును ఇదిసాధనంగా మానవ జాతి లోపాలను సంస్కరించడమే పర మావధిగా కనిపిస్తుంది.

ప్రతి మానవుడూ తనుపుట్టిచూచిన దానికంటె, తనుగిట్టేనాటికి తనసమాజాన్ని పైకో, ఒకఅడుగు ముందుకో లాక్కుపోవలెననే సంకల్పం ఉంటుంది. రచయిత అయినవాడు, అందులో హాస్య రచయిత గొప్పవిమర్శకుడు. సంస్కర్తగా తనలక్ష్యమును సాధించవచ్చును. తనసమకాలికుల నవ్వించవచ్చు. ఉద్రిక్తులను చేయవచ్చు. కార్యశూరులను చేయ వచ్చు. సత్పురుషులను చేయవచ్చు. అభిమానం, శృంగారం, భక్తి మొదలయిన వాటితో తనహాస్యాన్ని మేళవించి జీవితంలో అంతర్వాహినిగాఉన్న ఆనందాన్ని స్ఫురింప జేయవచ్చును. పైకిఉబికించ వచ్చును.

జీవితంలో ఏఘట్టమైనా తీసుకోవచ్చు. సంఘంలో ఏలోపాన్నైనా తీసుకోవచ్చు. నీచానికి దిగకుండా, బూతులేకుండా క్రౌర్యం లేకుండా ఉంటేచాలు. మరే నియమమూ కట్టుబాట్లులేవుదీనికి. దీనిని సాధించ గలిగినవారు మానవుల మనస్సులనూ హృదయాలనుకూడా తీర్చి దిద్దగలరు. వారికి ఉత్తమ లక్ష్యాలను చూపి, వారినిమార్చి, వారికిబోధించి, వారినిఉద్ధరించి ఉత్తమ ఆనందమార్గాన్ని ఉన్నతపథాలకు తీసుకుపోవడం ప్రహసనాల పరమావధి.

(ఆలిండియా రేడియోవారి అనుమతితో)

# నవ్వెందుకు?

మూలం:
శ్రీ కె. ఎ. అబ్బాస్

అనువాదం:
శ్రీ జె. శ్రీరాం

ఆ గడ్డు కరువురోజుల్లో బాబు బారిసాల్ నుండి కలకత్తావరకూ ముంగాళ్ళమీదే వచ్చేశాడు. దోవలోనే వందల కొద్దీ జీవాలు — ముసలాళ్ళూ, యువతులూ, పాలుగుడిచే పిల్లలూ ప్రాణాలు విడవడం అతను చూచాడు. కాని బాబు మాత్రం చావలేదు. తను ఇంకా బ్రతికి వుండడంలో మ్యాజిక్ ఏమిటో; అతనికే ఆశ్చర్యంవేసింది. అతన్ని పోషించడానికతని తలిదండ్రులులేరు. చూడడానికి భార్యాపిల్లలు లేరు. ఎక్కడికిపడితే అక్కడికి తన ఇష్టం వచ్చినట్లు వెళ్ళవచ్చు. ప్రొద్దునే — ఇంకా పట్నంలో ఎవరూ లేవనన్నా లేవరు— బయల్దేరుతాడతను ముష్టికి రోడ్లమీద కుప్పల్లో తినేదేమన్నా పొరపాటున పడిందేమో చూడడానికి వెతకడం అతనే ముందు. అన్నాతురులకోసం ప్రభుత్వం తెరిచిన అన్నదాన సమాజం ముందు 'క్యూ'లో మొదటివాడతనే ఏరోజూ. ఆ వూళ్ళోకల్లా మొట్టమొదట ఆ వేడి గంజినీళ్లు అతనికే చిక్కుతవి.

అతన్ని బాగా ఎరిగిన తోటిముష్టివాళ్ళు చెప్తారు - అతను ఆహారం మైలు దూరంనుంచైనా పసిపట్టగలడని. పట్నంలో ఎక్కడైనా ఏ మహానుభావుడైనా భోజనాలు బీదలకు పెడ్తున్నాడూ అంటే బాబు అక్కడ వుండాల్సిందే. ఏ వంటగది కిటికీలోంచి అయినా పనికి రాని ఆహారం క్రింద పడిపోతోందంటే అక్కడ బాబు వుండి అది రోడ్డుమీద పడకుండానే చేత జిక్కించుకుంటాడు. అతని జ్ఞానేంద్రియాలన్నీ ఒక్కదానికే ఎదురుచూస్తూ వుంటై—ఆహారం మైలు దూరాన ఏదైనా వండుతున్నారంటే చాలు. అతని ముక్కులు ఇక్కణ్ణుంచే వేట కుక్కల్లాగా రొప్పుతూ మొరుగుతూ వుంటై. 'పూర్తి బ్లాకవుట్' సమయాల్లో గూడా, అతను నేలమీద పడి వున్న అన్నపు మెతుకును ఇట్టే చూడగలడు. ఇక నిద్రపోతున్నప్పుడు కనేకలల్లో—పాలు ప్రవహించే నదులు అన్నపు కొండలు — రసగుల్లాలు ఆకాశానికి ఎగరడం ఇవ్వి. మేలుకుని వున్నంతసేపూ ఆహార సంపాదన— ఈ విషయమై ప్లానులు ప్రోగ్రాములు వేస్తూ వుంటాడు. యుద్ధంలో ఏ సైన్యాధిపతి కూడా బాబు అన్నపుముద్ద కోసం పన్నే వ్యూహాలు పన్నలేడు. ఏప్రియుడు గూడ తన ప్రియురాలి కోసం, బాబు ఆహారం కోసం తపించినట్లు తపించలేడు. ఆకలి అతనిలోని ఇతర కోరికలను చింతలనూ చంపివేసింది. ఒక అందమైన యువతి రోడ్డుమీద కనపడితే ఆమె బుగ్గలు ఫ్రెష్‌గా తయారు చేసిన బ్రెడ్డులాగా - ఆమె శరీరఛాయ

చక్కటి దానిమ్మపండులాగు కనిపిస్తె బాబుకు. ఆమెకనక ఆడది కాకుండా చక్కగా పండిన అన్నమో - ఓ జామ కాయో అయితే ఆమెను తినేద్దును గదా అనుకుంటాడు బాబు.

ప్రభుత్వంవారి వార్త ప్రకారం బెంగాలులో ఇంక కరువులేదు. పల్లెటూళ్ళ నుంచి కలకత్తాలోపడ్డ అన్నార్తులను కలకత్తాలోంచి వెడల నడిపారు పోలీసులు. కాని బాబు మాత్రం ఎట్లాగో పోలీసువారి కళ్ళపడకుండా తప్పించుకున్నాడు. అతను కలకత్తాలోనే వుండి పోయాడు.

కరువు బీదవాళ్ళ గుడిసెలను దాటి పట్టణాల్లో సామాన్య గృహస్థుల ఇళ్ళల్లోకిగూడా చొరబడింది. అన్నదాన గృహాలు మూసేశారు. అసలు దానమనేదే లేదిప్పుడు. 'పనికిరానిఆహారం' అనేది రోడ్డుమీద కనబడడం లేదిపుడు. ఇక మరి బాబుకు ఆహారం ఎట్లా!

ఇంతవరకూ బాబు అన్నివిధాలైన ప్రయత్నాలూ చేశాడు. ఆత్మగౌరవం అనేది లేకుండా సిగ్గులేకుండా ముష్టి ఎత్తాడు. మురికిగుంటల్లోని ముద్దల కోసం కక్కుర్తిపడ్డాడు. కాని దొంగతనం మాత్రం చెయ్యలేదు. అంతవరకూ తన స్థితిని ఇంకా తెచ్చుకోలేదతను. అది మరి పాపభీతి అనండి - పోలీసు భీతి అనండి! కాని మొత్తంమీద అతను దొంగతనం చెయ్యవలసి వచ్చినా-చేద్దామని అనిపించినా-ఏదో ఒక అదృశ్య శక్తి ఆపేసింది అతన్ని ఇన్నాళ్ళూ.

కానీ-ప్రతిదానికీ ఒకహద్దూ-అంతూ వుంది. చివరికి మనిషియొక్క నీతినియమాలకూవుందిహద్దు. మూడురోజులు ఉపవాసం చేశాక బాబుతన వ్యక్తిత్వం కరగిపోవడం గమనించాడు. అతనిపొట్ట వీపును అంటుకు పోయింది. ఇకనడవటానికిగాదు, నుంచోడానికి కూడాఅతనికి ఓపికలేదు. అగోమాదిరిబద్ధకంమాదిరిది కళ్ళమీద కూర్చునివుంది. అదినిద్రగాదు-దగ్గరికి వస్తున్న మరణం తాలూకు చిహ్నం. ఇంక ఆహారంకోసం అతను చూడడం ఎట్లా! బిచ్చంపెట్టమని అడగడానికి అతను పెదిమలను కదిపేస్థితిలో నన్నాలేదు. మనస్సు ఆలోచించడం మానుకుంది. హృదయం ఏమీ 'ఫీల్' అవడంలేదు. ప్రపంచం అంతా ఒకపెద్ద 'చపాటీ' లాగా అతనికీ, వ్యక్తిత్వానికీ అడ్డునుంచుంది,

నాలుగోరోజున పీలవంగానే ఏదో ఒకటి దొంగతనం చేసిఅయినాతినెయ్యాలని సంకల్పించు కున్నాడు. కాని ఎక్కడ? ఎట్లా? మిగిలిన కాస్తశక్తి వణకుతున్న కాళ్ళల్లోకి తెప్పించుకుని చౌరంగీపైపు బయల్దేరాడు బాబు.

పట్నం అంతా ఆనందమయంగా వుంది. ఇంద్రధనుస్సులోని రంగులన్నిటితో జెండాలు ఎగురుతున్నై. ప్రతి చోటా. అందరూ కులాసాగా ఆడుతూ పాడుతూ నవ్వుతూ వున్నారు. 'ఖాకీ' వేసుకుని మిలిటరీవాళ్లు రోడ్డుమీదా గట్లమీదా కూర్చుని, నుంచుని, సీసాలెత్తి తాగేస్తున్నారు 'ఏదో విందు జరుగుతోంది గావల్సు' అని అనుకోడానికి ప్రయత్నించింది బాబు మనస్సు. ఇంతలో మూసేసివున్న షాపు ప్రక్కమైకంతో కూర్చుని వున్న మిలిటరీ

వాడొకడు కనిపించాడు బాబుకు. అతని చేతిలో సగం ఖాళీ అయిన సీసా ఒకటి వుంది. వెంటనే బాబుకు కొత్తఉపాయం ఒకటి తట్టింది. చుట్టూతా చూశాడు. ఎవరూ లేరు పరిసరాల్లో. వెంటనే వాడి చేతిలోంచి సీసా గుంజేశాడు. అది పాడువాసన వేస్తోంది. కాని అంతకన్నా వాసనవేసే తిండికి అలవాటు పడి వున్నాడు బాబు ఒక్కగుక్కలో సీసా లోది గొంతులోకి వెళ్ళి పోయింది. మొదట కిరసనాయిలు గొంతులో పోసి నిప్పు అంటించినట్లనిపించింది బాబుకు. తరువాత మంటలు పొట్టకు, పేగులకు గూడా వ్యాపించినై. ఇంతలో ఎవరో బలంగా నుదుటిమీద కొట్టారు. తలఎత్తి చూశాడు. ముందున్న గోడ!

అతన్ని కాళ్ళు ఎక్కడకు తీసుకు వెళ్తున్నయ్యో అతనికి తెలీదు. కాని, అతని నాశికకు మాత్రము ఆహారం దరిదాపులో వున్నట్లు తోచింది. మూసుకు పోతున్న కళ్ళను బలవంతంగా ఎత్తి చూశాడు. అతని కలలు నిజమే ఐనై. అతని ముందే కొద్దిదూరంలో పళ్లెంలో చక్కగా అమర్చివున్న 'బిస్కట్లు, కేకులు, పళ్ళు, చేపలు ఇంకా ఏవేవో వున్నై. అది "గ్రాండ్ హోటల్" వంటయిల్లు. కాని బాబు మైకంలో అవి గమనించే స్థితిలో గాని, ఎవరినీ లెక్కచేసే స్థితిలో గాని లేడు. ఏమీ జంకు లేకుండా లోపలకు వెళ్ళిపోయి బల్లమీద ఘుమ ఘుమలాడే వేపిన చేప తీద్దామనుకుంటున్నాడు. ఇంతలో పక్కబల్ల మీద ఒక పెద్ద కత్తిప్రక్క ఒక బ్రెడ్డు ముక్కవుంది. బ్రెడ్డు! అతని మనస్సు సంతోషంతో ఊగులాడి పోయింది. ఈ గొప్ప పదార్థాలన్నీ వదలి ఆ ముక్కను మాత్రం తీసేశాడు. నాలుగు రోజుల తరువాత అతనికి ఆ బ్రెడ్డు వాసన మళ్ళీ వేసింది. ఇంక అతని ఆనందమేమిటి? ప్రపంచంలో బ్రెడ్డులో సగం మంచితనం వున్నది. ఇంకేమున్నది అనిపించింది బాబుకు.

నోరు తెరిచాడు ముక్కను కొరకడానికి. తెరిచిన నోరు అట్లాగే వుండిపోయింది. కొత్త గొంతులూ, కేకలూ, హడావిడీ వినిపించింది అతనికి. వంటవాళ్ళూ, నౌకర్లూ వచ్చారు అక్కడికి. ఒకడు చేతిలో వున్న బ్రెడ్డు ముక్క లాగేశాడు. చెంపలు వాచేటట్లు దెబ్బలు కొట్టారు, తన్నారు. బైటికి ఈడ్చేసి పోలీసులకు వప్పచెప్పారు. అతన్ని తీసుకువెళ్లి పోతుంటే ఒక వంటవాడన్నాడు: "దొంగముండాకొడుకు వాడబ్బసొమ్ము లాగా 'విక్టరీ డిన్నర్' తినడానికి వచ్చాడు గావల్ను" అంతా పకపకా నవ్వారు. కాని అతనికి అర్థం కాలేదు. బాబుకు 'డిన్నర్' అంటేఅర్థం తెలుసు 'ఆహారం' అని అర్థమిచ్చే మాట ఏభాషలోనైనా అతను వెంటనే జ్ఞాపకం ఉంచుకోగలడు కాని 'విక్టరీ' అంటే ఏమిటి? అతన్ని జైల్లో పెట్టిన కొన్ని గంటల వరకూ ఈ కొత్త మాట అర్థమేమిటా అని ఆలోచిస్తూ కూర్చున్నాడు.

ఎవరో నడుస్తున్నట్లు చప్పుడు-దీపపు వెలుగు. ఇంతలో ఏదో గుండ్రటిది చపాటీ మాదిరిది నేలమీద పడ్డది.

(మిగతా 46వ పేజీలో)

# భూస్వర్గం రావాలి!

శ్రీ ప్రయాగ కోదండరామ శాస్త్రి

అశాంతియే రెచ్చిందని
అసంతృప్తి హెచ్చిందని
దేశశాంతి కావాలని
తెల్లవాళ్ళ మొరుగుడులూ

సంస్కరణల ముసుగుక్రింద
సైనిక సన్నాహాలతో
తంధానాయని సంస్థా
నాధిపతుల పన్నుగడలు

ముక్కోటి తెనుంగు జాతి
ముక్కలుగా చెక్కలుగా
చీలదీసి చెదరగొట్టి!
పాలించే తెల్ల తెగులు

మరతుపాకి కొరకొరలో
పరపాలన సాగిస్తూ
'ప్రజలే చెలరేగా'రని
నైజాములు సీపీలు

నా యిళ్ళను కొల్లగొట్టి
చెల్లెళ్ళను చెరబట్టీ
ప్రజలపైన ధ్వజమెత్తీ
కవాతు చేస్తున్నారా

దండులుగా ఎత్తివచ్చి
ఊళ్ళ కూళ్ళు చుట్టుముట్టి
నడువీధిని పట్టపగలు
నరహంతలు చెలరేగారా?

పరదాలే లేవుగాని
పరువున్నది నాయింటికి
ధనగర్వం లేదుగాని
హృదయముంది నా చెల్లికి

నా యిల్లే నందనమూ,
నా చెల్లి గులాబిమొగ్గ;
ఎవడీ రాక్షసు డాత్మను
అందాన్ని చంపుతాడు?!

అధికారం పెచ్చుపెరిగి
హృదయం చచ్చిన వీడికి
ప్రత్యక్షపు పోరాటం
పసిపాపల గొంతులపై -

ఆమసీదు మూలల్లో
మురికి బూజు పరదాల్లో
ఈ రాక్షస కృత్యాలకు
ఏడుస్తున్నవి 'పీర్లు'!

తరాలుగా చీకట్లో
పరదా ముసుగుల్లో
కళ్ళకు కట్టిన గంతల్లో
కుమిలి కుమిలి పొగిలి పొగిలి
నా 'ముస్లిం సోదరి' క
న్నీళ్ళే కారుస్తున్నది!

ఈ కార్చిన కన్నీళ్ళే
నైజాం పిండిన సారం,
ఈ కుళ్ళిన గుండెకాయ
నైజా మిచ్చిన పండు!

నూటికి తొంభై మందిగ
కూటికి గుడ్డకు లేక

గంపెడు సంసారాలతో
చెట్టునీడ నంటుకొన్న
కార్మిక ప్రజాళి పైన
కత్తిగట్టి దూకింది ;

పలపట నొకబొల్లిదున్న
డాపట నొక ముసలిగేదె
అరక సాగ కగ్గిలోన
కుంటగట్టు తుమ్మచెట్టు
నాశ్రయించి సొమ్మసిలిన
రైతులపై పగబట్టి
నైజాం విషనాగు పడగ
లెత్తి వూపి ఒడుస్తున్నది ;

శతాబ్దాల చీకట్లో
దారి కొరకు తడువుకొంటు
పడుతు లేస్తు వెలుగులోకి
నడుస్తున్న తల్లితలను
చితకగొట్టి వేయాలని
తెల్లవాళ్ళ తొత్తు నిజాం
అణుపు బాంబు తెస్తున్నది ;

అడవిజాతి నైజాము
నాగరికం కావాలని
స్త్రీలను చెరబడుతున్నది,
ఇళ్ళు కొల్లగొడుతున్నది ;

పట్టపగలు
పిశాచాలు తాండవించు
శ్మశానాలు నడువీధులు ;
ఆ సైనిక శాసనాలు
పరచుకొన్న చీకటి తెర
లోకానికి కళ్ళుగప్పి
లోకాన్నే చెరుస్తున్నది ;

ధర్మం పడి చెడి బేలై
'తెల్లవాళ్ళ కాలిక్రింద
నోరుపడీ, నెత్తిపగిలి
మూల్గలేక మూల్గుతోంది ;

తిండికై తుపాకిగుండు
గాలికొరకు విషవాయువు
ఆరగించలేక ప్రజలు
అల్లాడుతు వున్నారు ;

ఉక్కు తెరలు క్రిక్కిరిసిన
దిక్కులేని తెలంగాణా
తెగించి లంఘిస్తున్నది,
మగటిమి చూపిస్తున్నది ;

"చస్తూ బ్రతికేది లేదు
బ్రతుకుతు చచ్చేదిలేదు-
చావో బ్రతుకో" అంటూ
కష్టజీవి రైతు కూలి
కనుగ్రుడ్డుల్లో పాపై,
కాళరాత్రి చీకట్లో
తళుకు మన్న తారకయై
ప్రతాపాగ్ని అప్పుడపుడు
పరవళ్ళే చేస్తున్నది
పైకి పైకి లేస్తున్నది ।

ముసల్మాను లొకటంటూ
ముసల్మాను రాజ్యమంటు
హిందూ ముస్లిం రక్తం
త్రాగి బలిసి క్రొవ్వెక్కిన
నైజాం ప్రభు రాజనీతి
తెల్లవాళ్ళ ఎంగిలాకు ;

ప్రజల కొరకు ప్రాణమిచ్చు
'బందగీ' లె ముసల్మాన్లు,
నరహత్యలు సాగించే
నైజామే సైతాను ;

నిరుపేదే ముసల్మాను,
నిరుపేదే హైందవుడు,

ఇరుగు పొరుగు వాళ్ళు వీళ్ళు
పొరుపు లేదు ఇద్దరికీ

ఈ యిరువురి చీలదీసి
పాలించాలని చూసే
నైజాం నరహంతకుడికి
కాలం చేరువైంది!

నా యింటిని కొల్లగొట్టి
నా చెల్లిని చెరబట్టిన
వాడు
కిరాతకుడు నరపశువు
హృదయం చచ్చిన రాక్షసి
వాడి కాత్మ చచ్చిపోయి
కళేబరం మిగిలింది!

ఈ గచ్చపొదకు లోకంలో
పెచ్చరిలే చోటులేదు!
మన గులాబి తోటలోన

నిలిచే ఆస్కారం లేదు!
తెగనరకండీ! తెగనరకండీ!!
కూకటి వ్రేళ్ళతొ కుళ్ళగించి ఈ
ముళ్ళపొదను నిర్మూలంచేయండీ!!!

మన ఇక్బాల్ టాగూరులు
ఉమరాలీ కృష్ణశాస్త్రి
కట్టుకున్న స్వర్గంలో
రాక్షసులకు చోటులేదు!
హతమార్చండీ! హతమార్చండీ!!
మళ్ళీతల చూపకుండ
హతమార్చండీ!!!

మరతుపాకి కొరకొరలో
పరపాలన సాగించే
నైజాములు సీపీలు
నేలకొరిగి పోవాలి!
ప్రజలే ప్రభువులుగా
భూస్వర్గం రావాలి!!



(43వ పేజీ తరువాయి)

తలుపు లోంచి ఇనప బొచ్చె ఒకటి లోపలకు తోసి 'తీసికో' అని అరిచాడు ఎవరో.

బాబు ఆబొచ్చెలోకి చూశాడు వెంటనే వెర్రిగా నవ్వడం మొదలెట్టాడు.

పోలీసు వాడికి ఆశ్చర్యం వేసింది.

ఏముందినవ్వటానికి. ఏమొచ్చిందేం! అన్నాడు అందులో నవ్వటానికేముందీ? బాబుకు నవ్వాగడంలేదు. ఒకటే నవ్వు 'నవ్వుతెర' వచ్చినట్లు ఊపిరికోసం ఆగి నప్పుడల్లా ఒక సారి ఆ బొచ్చెవైపు చూస్తాడు. మళ్లీనవ్వు!

"పిచ్చిముండా కొడుకు"

పోలీసువాడు తేల్చేసి వెళ్లిపోయాడు

కాని బాబుతన నవ్వుతో ఆ గదిగోడలను ఇంకా ప్రతిధ్వనిస్తూనే వున్నాడు. నవ్వాపుకోలేకుండా వున్నాడు. ఎందుకు? ఆనేల మీద ఇనపబొచ్చెలో వుంది తను హోటల్లో తిందామనుకున్నంతదే బ్రెడ్డు ముక్క!

# విప్లవకవి - షెల్లీ

శ్రీ వఝల వెంకటరామ శాస్త్రి

కవితాలోకంలో షెల్లీ 'మహాకవి' అని పేరు పొంది శాశ్వత కీర్తి వహించాడు. షేక్స్పియరు, కాళిదాసులతో సమాన మనిపించుకొన్నాడు.

ఇతడు ఒక కవి మాత్రమే కాడు. స్వాతంత్ర్య దేవతకు తన జీవితమును బాల్యమునుండి ఆహూతి జేసిన వ్యక్తి. శాంతి, అభ్యుదయం, స్వాతంత్ర్యం, ప్రేమ ఇవి ఇతని ఆజాన్మాంత ఆశయాలు.

షేక్స్పియర్, మిల్టన్, పోప్, బ్లేక్, షెల్లీ, బైరన్ మొదలగు పేరు పొందిన ఆంగ్ల కవులందరు తాము రాసే రచనలను సామాన్యప్రజలు చదివి ఆనందించాల్సనే ఉద్దేశంతోనే రాశారు. అంతేకాదు, చదువరులను ఆనందపరవశులను చేయటమే కాక వారిని ఉత్తేజపరచి కార్యోన్ముఖులను చేయడంకూడా వారి ఆశయం.

## ప్రజలే పరీక్షకులు

షెల్లీ ఈ విషయాన్ని గురించి ఏం చెప్పాడో చూద్దాం. "నారాతకు విలువ లేదని ప్రజలు అభిప్రాయపడితే వారికి నిరభ్యంతరంగా తల ఒగ్గుతాను. యే ప్రజలయితే మిల్టనుకు శాశ్వత కీర్తిని ఒసగారో, ఆ ప్రజలే నా కవిత్వము యొక్క విలువను కూడా పరీక్షించ తగినవారు.

నారచనలలో నేను చిత్రించిన మహత్తరమైన కథావస్తువు చదువరులను వుత్తేజపరచి వారిని కార్యోన్ముఖులను చేయలేకపోతే దీనికి కారణం ప్రజల మనస్తత్వములోని లోప మేమాత్రము కాదని గట్టిగాచెప్పగలను. తనచుట్టున్న వాతావరణంలోని సంఘటనలు తన మనస్సులో కలిగించిన ఆనంద విషాదములను తనతోడి ప్రజలకు చిత్రించి, వర్ణించి, చూపి వినిపించి ఆ ఆనంద విషాదములలో వారినికూడా పాల్గొనేలాగు చేయడమే కవియొక్క ప్రధాన కర్తవ్యం" అని రాశాడు షెల్లీ.

మానవులకు మనస్సుతోబాటు భాష కూడా పుట్టి పెంపొందటం ఇందుకు కాకపోతే మరెందుకు? తనప్రజలతో తన సమాజంతో సంబంధం లేని మనుష్యునికి భాషతో పని ఏమున్నది? అతని మెదడు పనిచేయాల్సిన అవసరమేమీ లేదు. ఇతరులకు వుపయోగపడని రచనలు అర్థంకాని అయోమయము లవుతాయి.

షెల్లీని గురించి విమర్శకులు చాలా మంది పుస్తకాలకు పుస్తకాలు రాశారు. ఇతని జీవితవిషయాలు, కవిత్వ పోకడలు, రచనలోని అందచందములు, మనస్తత్వం, ప్రపంచ సమస్యలమీద ఇతని అభిప్రాయాలు — ఈ విషయాలు ప్రతిఒక దానిమీద భేదాభిప్రాయాలతో

వాదోపవాదాలు ఇతడు అస్తమించిన రోజుననే ప్రారంభమైనాయి. ఇంత వరకు అంతంలేకుండా సాగుతున్నాయి.

ఉదాహరణకు: కొందరు ఇతడు నాస్తికుడంటారు. మరి కొందరు ఆనాటి మతాలను వ్యతిరేకించాడే కాని ఇతనికి దేవునిమీద నమ్మకం లేకపోలేదంటారు. స్త్రీల యెడ ఇతని ప్రవర్తన నీతి నీమం లేకుండేది అంటారు కొందరు. మరి కొందరేమో ఇతడు స్త్రీల నెంతో గౌరవించేవాడనీ, వారి స్వాతంత్ర్య ఆత్మ గౌరవాలకు భంగం కలగనీయక ప్రవర్తించేవాడనీ అంటారు. ఇలాంటి వ్యక్తిని గురించి ఒక చిన్నవ్యాసం సమగ్రంగా రాయడం కష్టసాధ్యమైన విషయం.

ఈ వ్యాసంలో రెండు విషయాలను గురించి చర్చించ దలచుకున్నాను. (1) స్త్రీల ఎడ ఇతని ప్రవర్తన ఏమిటి ? (2) ఇతడు అభ్యుదయ విప్లవ కవియా ? లేక భావ కవులలో ఒకడా ?

## అరాచక వాదికాదు

మొదటి విషయాన్ని గురించి ఇతడు స్త్రీల ఎడ అవినీతిగా ప్రవర్తించాడని అరాచకత్వమును (Free love) శ్లాఘించాడని సామాన్య అభిప్రాయం. కాని షెల్లీ జీవిత గాథను, రాతలను పరిశీలించితే ఈ అభిప్రాయానికి ఏమాత్రం తావులేదని స్పష్టమవుతుంది.

స్త్రీలంటే ఇతనికి అపారమైన గౌరవం, ప్రేమ వారి గౌరవాన్ని స్వాతంత్రాన్ని కాపాడటానికి ఎల్లప్పుడు పాటుబడ్డాడు.

బాల్యంలోనేఇతనిఅందాన్నిచూచైతే నేమి, ఇతని అభిప్రాయాలను విని అయితేనేమి హారియట్ అనేఅమ్మాయి ఇతనిచే ఆకర్షింపబడింది. తన స్వాతంత్ర్యాన్ని అరికట్టడానికి ప్రయత్నించిన తనతలితండ్రులతో దెబ్బలాటకు పూనుకొన్నది. తనవిప్లవకరమైన ఉద్ఘాటనలే ఈ అమ్మాయిని ఉత్తేజ పరచాయని నమ్మాడు షెల్లీ

ఇంటిలోని పోరాటంలో ఈమెకు చేయూత ఇవ్వక తప్పదని అనుకొన్నాడు: అది తన బాధ్యతగా గుర్తించాడు. అతని ప్రోత్సాహంమీద ఇంటిని వదలి వచ్చింది. ఆమెను దగ్గరకు తీశాడు.

కాని, చిన్ననాటనుండి ఏ రకమైన బానిసత్వాన్నైనా ఎదుర్కొనేవాడు. ఆనాటి ఇంగ్లీషు సమాజంలో స్త్రీల పరిస్థితి ఈనాటి మనదేశంలోని పరిస్థితుల కంటె దుర్భరంగా వుండేది. స్త్రీల ఈ బానిసజీవితానికి నిజమైన సాంఘిక కారణాలను తెలుసుకోలేక వివాహ సంస్కరణలోని కట్టుబాటులే దీని కంతటికి కారణమని భ్రమ పడ్డాడు. నిజమైన వివాహము ప్రేమబంధంగా వుండాలి గాని, చర్చిలో పాదిరీల ముందు తీసుకొనే ప్రమాణాల మీద అధారపడటం తప్పని చాటాడు. అలాంటి వివాహాలలో తనకు నమ్మకంలేదన్నాడు. షెల్లీ యొక్క ప్రత్యేకత ఏమంటే, తాను నమ్మిన దాన్ని దేనినైనా సరే తప్పక తక్షణం ఆచరణలో పెట్టేవాడు.

ఈ 'హారియట్'కు సహాయం చేయాలసిన బాధ్యత వుందని ఆమెను దగ్గ

రకు తీసుకొన్నాడు. కాని చర్చిలో వివాహం చేసుకొని ఆమె స్వాతంత్ర్యాన్ని అరికట్టలేనన్నాడు అప్పుడు అతని ప్రియమిత్రుడు, సహపాఠీ 'హాగు' అతనితో ఈలాగు చర్చించాడు. సంఘములో మీ ఇద్దరి సహవాసాన్ని గురించి తిట్టిపోస్తుంటే బాధపడేది హారియట్ గాని, నీవుకాదు. ఆమె బాధకు మితి వుండదు. సమాజంలో ఆమె గౌరవాన్ని కాపాడాలనంటే నీవు తప్పక చర్చిలో వివాహం చేసుకోవాల"న్నాడు. షెల్లీ హారియట్ బాధను గుర్తించి వివాహానికి వొప్పుకొన్నాడు. తాను నమ్మిన నాస్తికతత్వాన్ని గురించి తన తండ్రితో దెబ్బలాటవచ్చి తన జమీందారీ ఆస్తికి వారసత్వపు హక్కును కోలుపోయే పరిస్థితిలోకూడా తన తండ్రికి లొంగడానికి వొప్పుకోని వ్యక్తి ఈ పెండ్లివిషయంలో తన ఆదర్శానికి భిన్నంగా ప్రవర్తించడానికి వొప్పుకొన్నాడంటే, స్త్రీలయెడ అతనికున్న మహత్తర గౌరవమే దీనికి కారణం. మరేమీకాదు.

అతడు అరాచకత్వాన్ని సహించాడంటారు గదా ? ఈ ఘటనను వినండి. ఇతనికీ, 'హారియట్'కు వివాహమైన కొలది కాలంలో వీరిరువురు 'హాగు'తో కలిసి వుండటం తటస్థించింది. షెల్లీ ఇంట్లోలేనప్పుడు 'హాగు' 'హారియట్'ను మోహించి అవకతవకగా ప్రవర్తించాడు 'హారియట్' చాలా బాధపడింది. షెల్లీ ఇంటికి రాగానే ఈ విషయాన్ని అతనికి చెప్పింది. షెల్లీ ప్రశాంతంగా 'హాగు'తో మాట్లాడాడు. అతడు షెల్లీతో ఇలా అన్నాడు, "హారియట్‌ను చూసినప్పటి నుండి నాకు ఆమెమీద ప్రేమకలిగింది. దానిని భరించలేనప్పుడు ఏంచేయమంటావు ? నా తప్పేమున్నది ?" అని. దీనికి షెల్లీ జవాబు వినండి : "నీకు 'హారియట్' యెడకలిగినభావం ఎంతమాత్రం ప్రేమకానేరదు. అదికామోద్రేకం. మృగప్రాయమైన వున్మాదం. మానవులకు కలగవలసినదికాదు. అది ప్రేమేనా ? ఆలోచించుకో 'హాగ్' ! ప్రేమంటేఏమిటి? ప్రేమలో స్వాభిలాషకు తావులేదు. ప్రియురాలి ఆనందసౌఖ్యాలే కనిపించుతాయి. నీచర్య 'హారియట్'కు బాధను కలిగించిందే కాని, సంతోషం ఏ మాత్రం కలిగించలేదు. ఇదే నిదర్శనం నీది ప్రేమ కాదనడానికి" అని చెప్పాడు షెల్లీ.

ఈ మాటలను షెల్లీ అసూయ వల్ల గాని, 'హారియట్'పట్ల తనకున్న వైవాహిక బాంధవ్యము వల్లగాని చెప్పాడంటారా ? ఏ మాత్రం కాదు. ఎందువల్లనంటే, ఆ సంభాషణ తుదలో 'హాగు' "నేను చేసిందల్లా తప్పని గుర్తించాను. షెల్లీ ! నన్ను క్షమిస్తావా ? దీనిని మరచి పోగలవా ?" అని హాగు అన్నాడో లేదో, అతని పట్ల తన స్నేహం శాశ్వతం అని షెల్లీ దృఢంగా తెలిపాడు. అంతే కాదు. 'హారియట్' అమె అక్క - ఇద్దరు ఎంత దెబ్బలాడినప్పటికి 'హాగు'ను ఇంటనుంచి వెళ్ళగొట్టడానికి వొప్పుకోలేదు.

ఈ హారియట్‌ను ఎందుకు వదిలేశాడు ? మరొక స్త్రీని ఎందుకు స్వీకరించాడు ? అని అడుగుతారుగదా ! దాని విషయం ఏమిటి ?

షెల్లీ ఇతరులస్వాతంత్ర్యాన్ని ఎంత గౌరవించేవాడో తన స్వాతంత్ర్యాన్ని, ఆత్మగౌరవాన్ని కూడా అంతకంటె ఎక్కువగా కాపాడుకొనేవాడు. అలాంటి షెల్లీ యెడ 'హారియట్' తన అక్క సలహాలు తీసుకొని తన ప్రవర్తనను క్రమేపి మార్చు కొన్నది. తనకు బిడ్డ పుట్టబోతున్న దని తెలిసినప్పటినుంచి తన భర్త పెద్ద జమీందారీ కుటుంబానికి చెందిన వాడని తన సంతానం ఆ జమీందారీకి వారసులని అహంకారంలో మునిగి పోయింది. ఫాషన్, దర్జా ఎక్కువగా కోరడం మొదలిడింది. దీనికంతటికి కావలసిన డబ్బును తెచ్చిపెట్టమన్నది షెల్లీని. షెల్లీకి అసలు డబ్బంటే అంత లక్ష్యంలేదు అందులో తన ఆదర్శాలను పూర్తిగా వ్యతిరేకిస్తున్న తన తండ్రినివెళ్ళి డబ్బు అడగడం అంటే తన ఆత్మగౌరవానికి లోపంగా తలచాడు. అంతకు క్రితమే తన వారసత్వానికి స్వస్తిచెప్పాడు. అయినప్పటికి 'హారియట్' ను సంతృప్తిపరచడానికి తన ఆత్మగౌరవాన్నికూడా కొంతఅణచ కొని తండ్రితో సంప్రతింపులు, బెదరింపుల మూలాన కొంత అలవెన్సు తెప్పించాడు. కాని 'హారియట్' దర్జాకు ఇది సరిపోలేదు. ఆమె అసంతృప్తి ఎక్కువయింది.

దీనికితోడు ఆమెకు చదువు తక్కువ కావడం, అక్కగారి దుర్బోధన; షెల్లీ మానసిక జీవితంలోను, కవితా లోకం లోను పాల్గొనలేక పోవడం; సంభవించింది. షెల్లీకి ఆసమయంలోనే మేరీ అనే అమ్మాయితో స్నేహం కలిగింది. ఈమె స్త్రీ స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొంటున్న కుటుంబానికి చెందిన వ్యక్తి. ఉన్నత ఆదర్శాలు అభిప్రాయాలు కలిగినది చక్కగా చదువు కొన్నది. షెల్లీ రాతలలో అభిరుచి చూపడం, అతనితో కలసి చదవడం, చర్చించడం జరిగేది. ఈమె జీవితం షెల్లీ ఆశయాలకు అనుగుణ్యంగా ఉండడం, ఇంట్లో అక్క చెల్లెండ్ర బాధ దుర్భరం కావడం ఇవన్నీ ఇతనిని మేరీ దగ్గరకు తీసుకుపోయాయి హారియటును దూరంచేశాయి.

స్త్రీల యెడ ఇతని దృక్పథం ఎంత ఉన్నత మైనదో, ఇతని జీవితంలోని ఇంకొక ముఖ్యసంఘటనవల్ల తెలుసుకో వచ్చు.

ఇటలీ దేశంలో వున్నప్పుడు బైరన్ కవికీ, ఇతనికీ దగ్గర సహవాసం ఏర్పడింది. బైరనుకు స్త్రీ లంటే చాలహేయమైన అభిప్రాయం. వారు మందమతులని, స్వాతంత్ర్యానికి అనర్హులని, వారికి గౌరవం అనేది ఒకటి లేదని, పురుషులకు ఆటబొమ్మలుగా వుపయోగపడటానికి వారుసృష్టింపబడ్డారని అతనిఅభిప్రాయం ఆలాంటి వానితో మేరీ చెల్లెలు 'క్లేర్'కు సంబంధమేర్పడింది. ఒకబిడ్డ కూడా పుట్టింది కాని, బైరను క్లేరుయెడ తన బాధ్యతను గుర్తించడు. ఆ బిడ్డను తల్లి దగ్గరకుపోనివ్వడు. షెల్లీమిత్రులుగూడా షెల్లీకి, క్లేరుకు సంబంధం కట్టారు. ప్రపంచమంతా తన మీద దుమ్మెత్తి పోసింది. అయినప్పటికి షెల్లీ మాత్రం క్లేరును విడనాడకుండా పోషించాడు.

ఆమె గౌరవాన్ని తుట్టతుదవరకు కాపాడాడు.

ఒకనాడు క్లేరు బిడ్డ భవిష్యత్తును గురించి బైరనుతో మాట్లాడడానికి వెళ్లాడు. ఆ విషయంలో తల్లి అయిన క్లేరు అభిప్రాయాన్ని కూడా ఆదరించాల్సిందని బైరనును కోరగా, బైరను షెల్లీని వెక్కిరించి వేళాకోళంగా మాట్లాడాడు మరొకవ్యక్తితో ఈసంభాషణను వర్ణిస్తూ "బైరన్ కవిత్వం అంటే నా కెంతో ఇష్టం. కాని, ఆ క్షణంలో మాత్రం బైరనంటే నా కెంతో అసహ్యమేసింది. కోపం వచ్చింది అతనిని తన్నాల్లనిపించింది. కాని, గోడకు జడత్వ మెంత సహజమో, బైరనుకు అతని దుర్గుణం అంత సహజమైనది. అలాంటి వ్యక్తిని తంతే మాత్రం యేం లాభం అని మానుకొన్నాను. నా కోపాన్ని దిగ మ్రింగాను" అని అన్నాడు.

ఈ సమస్యను గురించి అతని రచనలో గూడా ఏం చెప్పాడో చూడండి. తన ప్రియురాలియెడ తనకున్న ప్రేమ ఏలాంటిదో వర్ణిస్తూ ఈక్రింది పంక్తులు రాశాడు.

I can give not what men call love
but wilt thou accept not
The worship thy heart lifts above
And the Heavens reject not,
The desire of the moth for the star,
Of the night for the morrow
The devotion to some thing afar
From the sphere of our sorrow?

ప్రేమ ప్రేమని జనులు భావించునట్టి
ప్రేమ నే నీయ లేనుగా, కేమికొదువ ?
తరుణి, నీ హృదయమ్ము నెత్తాల కెత్తు
నా ఒకా నొక అర్చితనే, అమర్త్య
లోకములకైనగాని తృణీకరింప
రాని యా అర్చితనె సమర్పణ యొనర్తు;
నీవుదాని మన్నించక పోవుగాక !
శారదా చంద్రికలకై చకోరపాళి
ఏ ప్రబల వాంఛతో అర్రులెత్తిచాచు,
ప్రాత రరుణ మరీచికై పద్మ మేమ
హోచ్ఛ్వలిత వాంచతో రేకు విచ్చిచూచు
ఎడదసిందిన ఆ మహితేచ్ఛలోనె
మన అగాధ విషాదసీమలకు దూర
దూరమున దోచునొక వెల్గు దారికొరకు
ఆత్మబలిదాన మిచ్చుకొన్నాను నేను !—

## విప్లవకవి

ఇక షెల్లీ కవిత్వాన్ని గురించి : సామాన్యంగా విమర్శకారులు ఇతనిని భావకవులలోనే లెక్కవేస్తున్నారు ఇతడు రాశిన Witch of Atlas, Adonais లాంటి వేవో కొన్ని పద్యాలు పాటలే ఈలాంటి విమర్శకులకు కనిపిస్తాయి. కాని ఇతని కవిత్వంలోని విప్లవ పోకడలను ఎత్తిచూపడానికి రెండు నిదర్శనాలు చాలు.

ఆనాటిఆంగ్లసమాజంలోని సామాన్య ప్రజలు, కార్మికులు, కర్షకులు, నిరంకుశ జమీందారీ ప్రభుత్వముక్రింద నలిగి అణగారిపోతున్నారు వారిని వుద్దేశించి "ఓ ఇంగ్లీషు ప్రజలారా!" అని ఒక చిన్నపాట రాశాడు, అందులోనివి కొన్ని ఈ దిగువ పంక్తులు.

The seed ye so, another reaps;
The wealth ye find, another keeps
The robes ye weave, another wears,

The arms ye forge, another bears.
Sow seed - but let no tyrant reap;
Find wealth, - let no impostor heap,
Weave robes, - let not the idle wear;
Forge arms, - in your defence to bear

నీవు పండిస్తేను ఎవడో నూర్చుకుపోయి
నీవు సంపాదిస్తె ఎవడో పోగేసుకొని,
నీవు బట్టలునేస్తె ఎవడో ముస్తాబయి,
నీవు కత్తులుచేస్తె ఎవడో చేతనుబట్టి—
ఏమిటిది ?

పంటలను పండించుకో. ..కాని,
ఈ నిరంకుశుల ప్రేలింత మోపగ నీకు !
ధనము సంపాదించుకో .. కాని,
ఈ దోపిడీంద్ర కువ్వలు పెంచుకో నీకు !
డక్కామజ్లిన నేసుకో....కాని,
ఈ సోమరులను సింగారించుకో నీకు :
కరకుకత్తులె చేసుకో....చేసుకొని,
నీ రక్షణకె పూని నిప్పు లురలించరా !

మరొక నిదర్శనం : ఆ నాటి నిరంకుశ ప్రభుత్వాన్ని విమర్శిస్తూ శ్లేష కవన మొకటి రచించాడు ; 'Mask of Anrachy' అని అందులో ఇలాగు చిత్రించాడు.

*Rise* like lions after slumber
In unvanquished number
Shake your chains to earth like dew
Which in sleep had fallen on you
Ye are many—they are few

* * *

What is freedom? you can tell
That which slavery is, too well
For its very name has grown
To an echo of your own.

* * *

Asses, Swine, have litter spread
And with fitting food are fed;
All things have a home but one·
Thou, Oh, Englishman, hast none !

* * *

What art thou freedom ? O ! could slaves
Answer from their living graves
This demand- tyrants would flee
Like a dream's dim imagiry

నిదురనుండి మేలుకొన్న
సింహాలై లేలెండి,
అజేయులై, అనేకులూ
లేలెండో లెండి !
నిద్రలోన చుట్టుకొన్న
సంకెళ్ళను మంచుబొట్ల
మాదిరిగా చటచటచట
విదలించే వెయ్యండి !
లే లెండో లెండి !
మీది అసంఖ్యాకబలం ;
శత్రువులా ఒకరిద్దరు !
లే లెండో లెండి !
స్వతంత్రమంటే ఏమిటి ?
మీకు తెలుసు — దానిసత్వ
మేలాటిదో. మీకు తెలుసు —
దానిపేరె పెమ్పెరిగి
మీ గొంతున మారుమ్రోగు !
లే లెండో లెండి !
పక్కలంటా కోళ్ళకుసూ
ఉండటానికిల్లు గట్టి
కావలసిన తిండిపెట్టి
తెగ బలిపిస్తున్నారు .
ఉండటాని కన్నిటికీ
చలువరాతి కట్టడాలె,
మీకు మాత్ర మీ ధరిత్రి
నిలిచేందుకు నీడలేదు !

తే లెండో లెండి !
ఓ స్వేచ్ఛాదేవి, నిన్ను
ఈ నీకటి వల్లకాట
జీవంతో గొట్టుకునే
బానిసలే తెలుసుకుంటె
నిరంకుశ స్వార్థపరులు
దుస్వప్నపు నీడలుగా
చెట్టుకొకరు పుట్టకొకరు
చెల్లాచెదరై పోదురు !

షెల్లీ రాశిన 'Cenci', 'Prometheus unbound', 'Revolt of Islam' లాంటి విప్లవరచనలు ఇతని అభ్యుదయ ధోరణికి నిదర్శనాలు.

ఇతడు భావకవి అని వాదించడానికి ఇతడు రాశిన 'Witch of Atlas', 'Episychedion' Ode to skylark' 'Triupmph of life' లాంటి రచనలను పేర్కొంటారు.

నిజంగా 'Witch of Atlas' మొదలైనవి భావరచనలే. 'Revolt of Islam' రాశిన మహాకవే 'Witch of Atls' ను కూడా రాశాడా అనిపిస్తుంది. ఈ 'Witch of Atlas' మొదలైన రచనలను షెల్లీ తన అంత్యకాలంలో రాశాడు 'Witch of Atlas' ను 1820 లో రచించాడు ఇతడు కాలం చేసింది 1822 లో.

ఈ Witch of Atlas ను గురించి ఇతని భార్య మేరీకిని ఇతనికిని ఒక వాదన జరిగింది. "ఏమిటిది ? ప్రజల జీవితానికి సంబంధం లేని ఇలాంటి ఊహాపోకడలోనికి దిగావే" అని ఆమె అడిగింది. ఇతడు దానికి చలోక్తిగా ఇలా జవాబిచ్చాడు. "పిల్లికూనలు ఎలుకలను పట్టడానికి కాకపోయినా యెదిగిన పిల్లుల మాదిరే చెలరేగడం లేదా ? అలాగే నన్ను గూడా అప్పుడప్పుడు ఊహాప్రపంచంలో తిరగనీ" అని. భావకవిత్వాన్ని గురించి ఇతని అభిప్రాయం ఇదే అన్నమాట.

## ప్రజల చైతన్యమే గొప్ప కవులను సృష్టిస్తుంది

కవిత్వం యొక్కయు, కవుల యొక్కయు ఆశయాలను గురించి రాశినప్పుడల్లా ప్రజా అభ్యుదయ విప్లవ పోకడలకే అగ్రస్థానాన్ని ఇచ్చాడు ఈ కవి దీనికేమి సందేహం లేదు. చూడండి 'Promatheus unbound' అనే రచనకు ఉపోద్ఘాతంలో ఏం రాశాడో :

"మిల్టన్ లాంటి గొప్పకవి మన దేశంలో పుట్టాడంటే అది అతని కాలంలో బ్రిటిష్ ప్రజలలో కలిగిన చైతన్య ప్రభావమే ఆ పవిత్రాత్ముడు స్వాతంత్ర్య పిపాసి అనే విషయం ఎవరూ మరవలేరు. అతడు అనాటిసంకుచిత మత తత్త్వములను, సామాజిక నిబంధనలను తీవ్రంగావిమర్శించాడు. ఇటీవల పుట్టిపెరిగిన ప్రబుద్ధ రచయితలు గూఢాతమ సమాజంలో ఏదోఒకమార్పు తీసుకురావడానికో లేదా క్రొత్తగా తలయెత్తుచున్న విప్లవపోకడలను సంఘటిత పరచడానికో సహాయపడినవారే కదా ?

ఒక మాటలో చెప్పాల్నంటే, కవులే కాదు, తత్త్వజ్ఞులు, శిల్పులు, గాయకులు, కళాపోషకులు అందరు సంఘంలోనుంచి పుట్టేవారు. సంఘంలో మార్పు తెచ్చే

వారు... ........ఈ సమాజాన్ని మార్చాలనేదే నా ఏకైక చింతనం."

తుది రోజులల్లో (1821) Hellas అనే నాటకాన్ని ఒకదానిని రచించాడు అందులో గ్రీకు స్వాతంత్ర్యపోరాటాన్ని చిత్రించాడు. రష్యా నిరంకుశ జారు చక్రవర్తి బ్రిటిషు సామ్రాజ్యవాదులు కలసి గ్రీసు స్వాతంత్ర్యాన్ని అణగదొక్కడానికి చేసిన కుట్రల నన్నిటిని చక్కగా వెల్లడి జేశాడు. ఈ నాటకానికి ముందుమాటలో యిలా రాశాడు "బ్రిటిషు ప్రజలకుంద నిరంకుశాధికారం చలాయిస్తూ, ఆ బ్రిటిషు ప్రజలకే ప్రాతినిధ్యం వహిస్తున్నామని డప్పాలు కొట్టుకొంటూ ఈనాటి గ్రీక్ ప్రజల స్వాతంత్ర్య పోరాటాన్ని వ్యతిరేకిస్తున్న దోపిడీవర్గాన్ని ఎన్నడో ఒకనాడు బ్రిటిషు ప్రజలు అధికారంనుంచి తొలగించకపోరు. ఆనాడు ఈ నిరంకుశాధికారుల ప్రస్తుత ప్రజా వ్యతిరేక పంథాను సమాలోచించక తప్పదు. ప్రపంచలో పీడిత ప్రజలకు, నిరంకుశాధిపతులకు మధ్య పోరాటం ఆరంభమైనది. సాగుతున్నది. అధికారస్థానాలలోవున్న ముఠాల నాయకులును, రాజులని పిలవబడే ఈ దోపిడీగాండ్రు ఖూనీదార్లను, వీరందరు తమలో తాము ఏకమై, తమమధ్య వున్న స్పర్ధలన్నిటిని దిగమ్రింగి. తామెవరిని ఎదురొక్కొంటున్న ప్రజాశక్తితో అంతిమ పోరాటానికి సిద్ధపడుతున్నారు ప్రపంచములోని ప్రతిదేశంలో వున్నట్టి నిరంకుశ ప్రభువులందరు దోపిడీ ముఠాలో కలుస్తారు. కాని యూరపుఖండమంతటా ఒక నూతన శక్తి వెలువడింది. బానిస ప్రజలు తమకు శృంఖలములుగానున్నట్టి మూఢాభిప్రాయాలన్నింటిని అసహ్యించుకొంటున్నారు ఈశక్తి నానాటికి పెరగక తప్పదు ఈ ప్రచండశక్తిముందు నిరంకుశత్వం నశించి తీరుతుంది. దోపిడీగాండ్రు ఈసత్యాన్ని గ్రహించే కంపిస్తున్నారు"

ఇలాంటి వున్నత వుద్దేశాలు, అభిప్రాయాలున్నట్టి వ్యక్తి ఊహా ప్రపంచములోకి వెళ్ళిపోయి Witch of Atlas లాంటి రచనలు రాశాడంటే దీనికి కారణం లేకపోలేదు ఈ కారణాలు షెల్లీ జీవిత చరిత్రలోనే కనిపిస్తాయి. తన చుట్టు, యూరపుఖండంలోని వాతావరణంలో వచ్చిన మార్పులుకూడా కొంతవరకు అతన్ని భావకవిత్వంలోకి దింపడానికి కారణభూతమయినవి.

ఈ కారణాలను పరిశీలించడానికి ముందు మరొక చర్చనీయాంశం వస్తుంది.

కవి యొక్క రచనావిశేషం అతని జీవితానుభవాలమీదను, అతనిచుట్టున్న వాతావరణము యొక్క పరిస్థితుల మీదను పూర్తిగా ఆధారపడి వుంటుందనే మతం ఒకవైపు కవిత్వం యొక్క గొప్పతనానికి కవి యొక్క వాస్తవిక జీవితానికి ఏలాంటి సంబంధము లేదనిన్నీ, కవి రచనా విశేషము ఏదో ఒక ఆత్మశక్తి లేక అపూర్వమైన అమానుష శక్తి పైననే ఆధారపడి వుంటుందనే మతం మరొకవైపు పూర్తి వ్యతిరేకములైన ఈ రెండు మతములకు మధ్య అనేక రకాలైన భిన్నాభిప్రాయాలు

బయలుదేరి నిరంతర వాదనలకు దారి తీస్తున్నది.

ఈ సమస్యను గురించి షెల్లీ అభిప్రాయము ఏమిటో చూడడం గూడా చాలా అవసరం. ఇంతకు క్రితమే Prometheusr unbound ఉపోద్ఘాతంలో అతడు రాశిన వాక్యాలను ఉదహరించాను. మరొకచోట ఇలా రాశాడు

"కవికి యెంత ప్రతిభాశక్తి, మేధస్సు వున్నా చాలదు కవిత్వరచనకు ఒక ప్రత్యేక విద్య అత్యవసరం కవికి తన అనుభవాలను చక్కని విచక్షణతో జీర్ణించుకునే మనస్తత్వం వుండాలి దానితోబాటు అలాగు జీర్ణించుకొనబడిన తన అనుభవాలను ప్రజలకు అర్థమయ్యేలాగు చిత్రించగలిగిన వ్యక్తి వుండాలి "..... (కవి తనకున్న అనుభవాలనన్నింటినీ వర్ణించి) ఇవన్నీ నాసంస్కార సాంప్రదాయం, ఇవియే నారచనలకు మూలములు. నాకవిత్వ ధోరణి పూర్తిగా ఈఅనుభవాల మీదనే ఆధారపడి వున్నది ఈ అనుభవాలన్నీ వున్నంత మాత్రానే ఒక వ్యక్తి కవి కాలేడు కవికి అన్నిటికంటే ముఖ్యంగా వుండవలసిన లక్షణం- తాను గడించిన అనుభవాన్ని ఏన చదువరులలో రేకెత్తించ డానికి తగినట్టి రచనను చిత్రించ గలశక్తి-అది వుంటేనే ఆరాతగాడు కవి అవుతాడు."

కవిత్వమును గురించి ఇలాంటి అభిప్రాయాలున్న కవిని అరని పరిస్థితులే అతన్ని ఆదారిలోకి లాగకపోతే అతడు భావకవి ఏలాగు కాగలగుతాడు.

ఆలోచించతగిన విషయం ఇంకొకటి ఏమిటంటే, అతడు జీవించిందల్లా 29 సంవత్సరములు. కవిత్వం రాయడము ఆరంభించినది చాలా చిన్న వయస్సులోనే అయినప్పటికి 7, 8 సంవత్సరాలలోనే ఇతని రాతలన్నీ పూర్తి అయినాయి. ఇంత కొద్దికాలములో ఇతని కవిత్వధోరణిలో ఇంత విపరీత మార్పులు కనిపించడానికి, కారణాలు ఇతని జీవితం అంతవేగంగా నడవడం, చుట్టూవున్న దేశకాలపరిస్థితులలో గూడా మార్పులు అంతవేగంగా ఏర్పడడమే; మరేమి కాదు ఇది పరిశీలించ తగిన విషయమే.

## కవి జీవితానికి, అతని కవిత్వానికి పరస్పర సంబంధం

షెల్లీ చాల సున్నితమైన శరీరం కలవాడు, చాలా అందగాడు. దేహదార్ఢ్యంలేదు గాని, మనోస్థైర్యానికిమితి లేదు. పెద్ద జమిందారీ కుటుంబంలో పుట్టినప్పటికి చిన్ననాటి నుండి ఏ వ్యక్తిగాని, మరొక వ్యక్తిమీద అధికారాన్ని చలాయించడాన్ని ఏ మాత్రం సహించేవాడు కాదు తనకు తండ్రి కొడుకుమీద చూడ అధికారం చూపకూడదనే ఇతని మతం ఆ రోజులు ఫ్రాన్సులో స్వాతంత్ర్య విప్లవం జరుగుచున్న రోజులు. ఆనాటి ప్రజల నినాదాలు స్వాతంత్ర్యం, సమానత్వం, సౌభ్రాతృత్వం ప్రతి ఇంట, ప్రతినోట ప్రతిధ్వనించుచుండేవి ఈ వాతావరణంలో పుట్టి పెరిగాడు.

ఇతడు బాల్యంలోనే కవిత్వం రాయడము మొదలుపెట్టాడు. కుర్రతనంలో

రాశిన రాత చూడండి. భావాలు ఏలా గున్నాయో ఆ జమీందారీ కుటుంబంలో పుట్టిన కుర్రవానికి. పిల్లిమీద రాశాడు ఒక పాట. అందులోనిది ఇది.

One wants society
Another veriety,
Others a tranquil life.
Some want food
Others as good,
Only want a wife
But this poor little cat
Only wanted a rat
to stuff out its own little maw.
And it were as good
Some people had such food
to make them hold their jaw

ఒక్కనికితోడు కావలె, నొకని కేదొ
వింత కావలె, వలయునేకాంత మొక్క-
కొందరికి, తిండికావలె కొందరకును,
కొందరికి పెండ్లమే సమకూడవలయు-
కాని, పాపము, ఈ పిల్లికూన కొక్క-
చుంచెలుక చాలు తనపొట్ట నింపుకొనగ
ఆ విధమ్మననే దవడాడు కొరకు
కూడు కావలె నెందరికో...

స్వాతంత్ర్యయోధుల్ని వాత బెట్టు కొన్న మరణదేవతను గురించి ఈ బాలుని అభిప్రాయాన్ని చూశారా.

Death! where is thy victory ?
To triumph whilst I die,
To triumph whilst thine ebon
wing
Enfolds my shuddering soul ?
O death ! where is thy sting?
Not when tides of murder roll,
When nations groan, that kings
may bask in bliss
Death ! canst though boast
a victory such as this-
When in this hour of pomp and
power
His blow the mightiest muderer
gave,
Mid nature's cries the sacrifice
Of millions to glut the grave,
when sunk the tyrant desolation's slave,
Or freedom's life-blood streamed
upon thy shrine,
Stern tyrant, couldst thou boast
victory such as mine

ఓ మృత్యుదేవతా,
నీ విజయ మొక్కడా ?
నేను చస్తున్నప్పుడా
నీ విజయ ఘోష ?

నీ దయ్యపు కారురెక్క
అదరి పోవునా గుండెను
క్రమ్మి కలచివేసినప్పుడా ?
ఓ మృత్యుదేవతా,
నీకోర పదునెక్కడా ?
రారాజుల పగటి కలలు
రాణువులై నిలిచేందుకు
నరహత్యలు మిన్ను ముట్టు
తున్నప్పుడు కాదే
తలలు పగిలి గొంతులు తెగి
మొండెములై తుండెములై
ఏద్వలేక జాతి మూల్గు
చున్నప్పుడు కాదే-
ఇటువంటి విజయ మొక
టిని సాధించినావా ?
సరదాలతో తూగి తూలి
కరకు కత్తి పరిపాలన
నరహంతలు రారాజులు
తమ బానిస మాత్రులైన
ప్రజపైబడి చావు దెబ్బ
కొట్టి ముట్టినా గదే
ఓ మృత్యుదేవతా,

నీ కోర పదు నెక్కడా ?
ప్రకృతి మాత ఘోషిల్లగ
లక్షలాది ప్రజా కోటి
శ్మశానాలు మ్రింగరేని
చావుతెంపు జూపు నప్పుడా ?
స్వతంత్ర వీరుల రక్తం
వాగులుగా తోగులుగా
నీ పల్లకాటి గుడిమెట్టను
ముంచెత్తి పొరలివచ్చునప్పుడా ?
క్రూర మారణ దేవతా.
నా విజయ మటుపంటి
దొకటేని సాధించినావా ?

అతని బాల్యావస్థలోని రచనే ఎంత చురుకుగా అభ్యుదయ పోకడలో నున్నదో చూపడానికే ఇంత విపులంగా ఈ పద్యాన్ని ఎత్తిచూపాను.

బడిలో చదివే రోజులలో రౌడీపుత్ర వాళ్ళతో దెబ్బలాడటానికి శక్తిలేక వారిచే తన్నులు తిన్నప్పటికీ, వారికి యే మాత్రం లొంగకుండా వారిని ఎదిరించేవాడు. నాస్తికత్వం, సమాజంలోని దురాచారాలను ఎదురొక్కవడం, మతాన్ని తూలనాడడం - ఈ గుణాలన్నీ ఇతనికి బాల్యంలోనే పుట్టినవి. హైస్కూలులో చదివే రోజులలోనే తోడిపుత్రవాళ్ళతో యిలా అనేవాడు.

"దేవుడు న్యాయమూర్తే అయితే, సహజంగా పాపకర్మలు చేయకుండడానికి కావలసినంత మనోధైర్యం లేని మానవులను అతనే సృజించి మళ్ళా వారు చేసే ఆ పాపకర్మలకే వారినిపట్టి శిక్షించడం ఎక్కడి న్యాయం" అని

తీవ్ర మతసంబంధము కలిగిన ఆక్స్ఫర్డ్ (Oxford) కళాశాలలో చదువుచునే అక్కడి మాస్టర్లను యెదిరించి నాస్తికవాద ప్రచారాన్ని కొనసాగించాడు. తన ఆశయాలను విడనాడడానికి ఎంతమాత్రం ఒప్పుకోక కాలేజినుంచి వెడలకొట్టబడ్డాడు. తండ్రిదగ్గరనుంచిదూరమైపోయాడు ఆస్తిహక్కులను కోలుపోయాడు సంఘంలోనుంచి వెలివేయబడ్డాడు. ఎన్ని ఇడుమలకైనా ఓర్చి తన స్వాతంత్ర్య ప్రచారాన్ని తీవ్రంగా నడిపాడు. ఆనాటి ప్రభుత్వాన్ని దిఃఖరించాడు ఆరోజులలో తన ప్రియమిత్రుడు సహపాఠి అయిన (Hogg) హాగుతో ఇలా అన్నాడు ఒకప్పుడు.

"మన సాహిత్యమంతా శుద్ధమాటల తడరగా నుంటున్నది. దీనికంటె అనేక రెట్లు ముఖ్యమైనది శాస్త్రపరిశోధన. ఈ శాస్త్రములమూలాననే విషయ పరిజ్ఞానమును, దానిమూలాన ప్రజావిజ్ఞానాభివృద్ధి కలుగుతుంది" అని.

కవికి మంచి ఉత్సాహవంతమైన రోజులు ఇవి. యూరపులో స్వాతంత్ర్య పోరాటం తీవ్రంగా జరుగుతున్నది. కవిగూడా ఆ విప్లవారుణకాంతులను చూచి పుప్పొంగాడు. తను దెబ్బలు తిన్నా, ధీమాతో పోరాటానికిసిద్ధపడ్డాడు. ఇలాంటి సమయంలో రాశాడు. (Queen Mab) అనేకావ్యం. దీనిలోని అభ్యుదయ పోకడ ఈ క్రింది భావాలలో కనిపిస్తుంది.

From kings, and priests and statesmen, war arose,
Whose safety is man's deep unbettered woe.
Whose grandeur his debasement, let the axe

Strike at the root, the poison tree will fall
And where its renowned exhalations spread
Ruin and death and woe, where millions lay
Quenching the serpents' famine, and their bones
Bleaching unburried in the putrid blast,
A garden shall arise, in loveliness surpassing fabled Eden

ఎవరిక్షేమం మనిషి మనిషికి
తీరనీ దుఃఖమ్ము గూర్చెనొ,
ఎవరి దర్జా మనిషి మనిషిని
క్రుంగదీసినదో—
ఆ రాజులే, మతకర్తలే, చా
ణక్యులే యుద్ధాలు తెచ్చిరి ;
ఆ మొదటికే నీ గండ్రగొడ్డలి
పెట్టు పెట్టుమురా !
అంతతో ఆ విషపు చెట్టూ
కూలిపోవునురా !—
ఎక్కడెక్కడ దాని గాలులు
సోకి, శైథిల్యాలు చావులు
దుఃఖములు పొంగుకొనివచ్చి
ముంచివేసినవో ;
ఎక్కడెక్కడ దానికాటులు
తగిలి, కరువూ కాటకాలతొ
లక్షలకు లక్షలూ ప్రజలూ
ఆహుతైనారో ;
ఎక్కడెక్కడ ప్రజల అస్థులు
గాలికే తూలాడి పోతూ
ఘోరదుర్గంధమ్ము క్రమ్మి
క్రాగి పోయెడినో ;
అక్కడక్కడ నందనోద్యా
నాన్ని తలదన్నే, నవేందిర
నాట్యమాడే పూలతోటలు
మొలక లెత్తుతవి !

కాని కవి ఈ రచనను ప్రచురించడానికి ఇష్టపడలేదు. కొద్ది ప్రతులు మాత్రం వేయించి మిత్రులకు పంచి పెట్టాడు దీనికి కారణం తరువాత కవియే చెప్పాడు. అతని పేరు ప్రతిష్టలు గొప్పగా పెరిగిన తరువాత 1821 లో అతని సమ్మతిలేకుండా దీనిని ప్రచురించారు కొందరు. దీనిని ఖండిస్తూ ఇలా రాశాడు.

"కుటుంబంలోగాని, రాజకీయజీవితంలోగాని, సమాజంలోగాని, మతజీవితంలోగాని, ఎక్కడైనాసరే ఏ విధమైన నిరంకుశాన్నైనా పట్టుదలతో ఎదిరించడమే నాజీవితాశయం. నా చిన్ననాటి ఈ రచన ఆ ఆశయం తోనే రాయబడింది. దీనిని ఇప్పుడు ప్రచురించడాన్ని వ్యతిరేకిస్తున్నానంటే కారణం - సాహిత్యలోకంలో నా ప్రతిష్టకు, శ్రేయస్సుకు భంగం కలుగుతుందని కానే కాదు. అందులోని కథా వస్తువు కాని, రచనావిశేషము కాని, బాషా ప్రయోగముగాని నా స్వాతంత్ర్యవుద్యమాన్ని ప్రజలలో ముందుకు తీసుకొని పోవడానికి అంతగా తోడ్పడక పోవటమే కాక, ఆ ఉద్యమాన్ని దెబ్బ కొట్ట కలదేమో అనే భయమొక్కటే ఈనా వ్యతిరేకతకు కారణం."

తదుపరి అతని కవిత్వ ధోరణి ఎలా నడిచింది ? నవయుగాన్ని నిర్మించాలని నడుముగట్టాడు కవి. యూరపు ఖండంలో ప్రజా విప్లవం వస్తున్నదని గ్రహించాడు. దానికిగా కృషి చేయడానికి

ఆలోచించడమంటే అతనికి తనజీవితం లోని బాధలన్నీ మనస్సులోకి వచ్చేవి. ఆబాధను ఓర్చుకొనే ఓపిక పోయింది. ఊహా ప్రపంచంలో దాక్కోవటం ఆరంభించాడు" ఫలితం భావకవిత్వం.

కీట్సు, బైరన్ లాగే ఇతడు గూడా చాలా చిన్న వయస్సులోనే (29 ఏండ్లకు) కాలం చేశాడు. విమర్శ కారులు చాలామంది అంటారు-ఆహా! ప్రపంచానికి ఎంతనష్టం కలిగింది. ఇంత చిన్నతనంలోనే యింత చక్కని రచనలను రాశినవాడు ఇంకా కొన్నాళ్లుంటే ఇంక యెంత మంచివి రాశేవాడో కదా! అని. కాని బ్రిటిషు సమాజంలోను, యూరపులోను అటు తరువాత యేర్పడిన పరిస్థితులను షెల్లీకడపట రాశిన రచనలను బట్టి చూస్తే అతడు యింక ఎక్కువ కాలముండి వుంటే తప్పక Wordswoth, Tennyson లాగా తయారయే వాడు. దీనికి సందేహమేమీలేదు.

ఇందులో ఇంగ్లీషుపద్యాలకు అనువాదం — శ్రీ ప్రయాగ కోదండరామశాస్త్రి



# రంగుల ప్రపంచం

శ్రీ డి. ఎ. ఎ. ఎస్. నారాయణరావు

"ఆమె కన్నులలో ననంతాంబరంపు నీలి నీడలు కలవు."

అనంతాంబరంపు నీలినీడలు కవి హృదయంలో నాటుకొన్నాయి. అవే 'ఆమె కన్నులలోకూడా ప్రతిఫలిస్తు న్నాయి. వర్ణవైచిత్ర్యం కవి హృద యాన్నేకాదు, ప్రతి మానవుని హృద యాన్ని ఉత్తేజపరుస్తుంది. మానవునే కాదు క్రిమికీటకాదులను, జంతుజాల మును కూడా ఉద్రేకిస్తుంది. మగనెమలి తన చిత్ర విచిత్ర వర్ణపింఛమును విప్పి నాట్యమాడేది తన స్త్రీ హృదయాన్ని ఆకర్షించడానికే. సీతాకోకచిలుక రంగు రంగుల రెక్కలు రెపరెపలాడించేది తన పురుషుని హృదయాన్ని దొంగిలించ డానికే. పై మెరపులతో తళుకులతో భ్రమించకపోవడం సాధారణమానవునికి సాధ్యంకాదు. ఈ మెరపులూ తళుకులే మానవజీవితానికి వన్నెలూ చిన్నెలూ. ఈ వివిధ రంగులూ, ఆకర్షణలే లేక, ప్రపంచమంతా 'ఒక్కటే కారురూపు' అయితే ఎంత దుర్భరంగా ఉంటుందో ఊహించుకొన్నప్పుడు, ఈ రంగుల అందం ఇంకా ఇనుమడిస్తుంది.

ఇంద్రధనస్సు, ఆకాశపు నీలిమ, వసంతంలో చిగిర్చిన నునులేతకొమ్మల నిగనిగల గురించి పాటలు పాడడమే కవి పనికాని, ఆ వర్ణముల అంతర్యం గురించి అతని కక్కరలేదు. రంగుల వలన భావోద్రేకం పొంది రంగుల ప్రతి సృష్టితో ఇతరుల మెప్పు పొంద డమే చిత్రకారుని పనిగాని, ఆరంగుల రహస్య చ్ఛేదనంతో అతనికి ప్రశక్తి లేదు ఈ రంగులేమిటి? ఈ వివిధ రంగులెలా వస్తున్నాయి అనే విషయం గురించి జిజ్ఞాసపడి, కృషిచేసి, అపార మైన జ్ఞానాన్ని సంపాదించినవాడు విజ్ఞానశాస్త్రజ్ఞుడు. రంగుల గురించి కవి పాడిన పాటలను విని విజ్ఞానశాస్త్రజ్ఞుడు ఆనందిస్తాడు. రంగుల గురించి విజ్ఞాన శాస్త్రజ్ఞుడు సమీకరించిన జ్ఞానాన్ని అభ్యు దయ కవి తెలిసికోనక్కరలేదా?

అసలు మనకు యేవస్తువయినా అగ పడడానికి, రంగులను ప్రదర్శించడానికి కారణం కాంతి. ఒక చీకటి రాత్రిలో తలుపులన్నీ మూసిన గదిలో మనం ఉంటే అక్కడ వస్తువులూ అగపడవు, రంగులూ అగపడవు. కాంతి వస్తువు మీద పడి పొందే మార్పులలోనే వస్తు వును, దాని రంగులను మనకు ప్రదర్శి స్తుంది. కనుక వస్తువుల రంగుల గురించి తెలిసికొనేముందు, కాంతి గురించి కొంత తెలిసికోవాలి.

సూర్యునివద్దనుండివచ్చే కాంతిగాని, విద్యుద్దీపంనుండివచ్చే కాంతిగాని మనకు తెల్లగా అగపడుతుంది. కాని ఆకాంతిని ఒక గాజు పట్టకము (glass prism) ద్వారా పంపితే, అందులో ముఖ్యంగా

ఏడురంగులు, ఎరుపు, నారింజ, పసుపు, ఆకుపచ్చ, నీలి, నేరేడుపండురంగు, ఊదా వరుసగాచూడనగునని 'న్యూటను' గనుగొన్నాడు. న్యూటను ప్రయోగాల వలన తెల్లకాంతి అన్నది వేరు వేరు రంగుకాంతుల మిశ్రమమని తేలిపోయినది. ఆ వేరు వేరు రంగుకాంతులను సరియైన నిష్పత్తులలో మిశ్రమం చేస్తే అదే తెల్లకాంతిగా అగపడుతుంది యే కాంతి కిరణమయినా, గాలినుండి గాజు లేక నీరువంటి ఇంకొకపదార్థంలోకి ప్రవేశిస్తున్నప్పుడు కొంతవంగుతుంది. దీనిని వక్రీభవనము (refraction) అంటారు. వేరు వేరు రంగుల కాంతికిరణాలు వేరు వేరు కోణాలలో వంగుతాయి. తెల్లకాంతిని గాజు పట్టకం ద్వారా పంపినప్పుడు, వివిధ రంగుకాంతులు వేరు వేరు కోణాలలో వంగుటచేతనే విడిపోయి, వేరు వేరుగా అగపడతాయి.




గాజు పట్టకము

కాంతి స్వభావంగురించి కాంతితరంగ సిద్ధాంతమన్నది స్థాపింపబడ్డది. క్రిందటి శతాబ్దంలో దీనిప్రకారం కాంతిఒకచోటునుండి ఇంకొక చోటికి ప్రసరించిందంటే ఒక కదలిక లేక సంచలనం తరంగ రూపంలోవ్యాపించిందన్నమాట. ఇలాగ కాంతి తరంగ రూపంలో వ్యాపిస్తున్నప్పుడు ఆ తరంగాలకొక ప్రత్యేక కొలత ఉంటుంది. దానినే అల పొడవు (wavelength) అంటారు. కాంతి అల పొడవుకీ, రంగుకీ సంబంధముంది. వేరు వేరు రంగుల కాంతులంటే వేరువేరు అల పొడవుల కాంతులన్నమాట అల పొడవు క్రమేపీ హెచ్చు తున్నప్పుడు రంగు క్రమేపీ ఊదానుండి ఎరుపులోకి మారుతుంది. కాంతియొక్క అలపొడవు చాలా చిన్నది. దీనిని చెప్పడానికి ఒక సెంటీ మీటర్లో పది కోటియవ భాగాన్ని రూపంగా తీసుకున్నారు. దానిని ఒక అంగ్స్ట్రాము యూనిటు అంటారు. ఊదా రంగు కాంతి అలపొడవు 4000 అంగ్స్ట్రాము యూనిట్లప్రాంతాల్లో ఉంటుంది. ఎఱుపురంగుకాంతి అలపొడవు సుమారు 8000 యూనిట్లదాకా ఉంటుంది. తక్కిన రంగుల కాంతుల అలపొడవులు ఈ మధ్యగా ఉంటాయి. మామూలుగా మనం తెల్లకాంతి అన్న దాంట్లో ఎన్నోరంగుల కాంతు లున్నాయంటే, 4000 — 8000 యూనిట్లకు మధ్యగా ఉండేటటువంటి

వివిధ అలపొడవులుగల కాంతు లున్నాయన్న మాట. మన కంటి కగపడక పోయినా ఇతర అలపొడవులుకలకాంతి కూడా ఉంది. 4000 ఆ యూ. కు ఇంకా తక్కువగా అల పొడపు కల




వివిధరంగులకాంతి అలపొడవుతెలిపే పటం

కాంతిని అతి నీలలోహిత కాంతి (ultraviolet light) అంటారు. అది మన ఆరోగ్యానికి కొన్ని విధాలుగా ఉపకరిస్తున్నా, దానిని మనం కంటితో చూడలేము. దానిరంగును అనుభవించలేము. కాని కొన్ని కీటకాలు కొన్ని పుష్పాల నుండి వచ్చే అతి నీలలోహిత కాంతిని చూచి, ఆకర్షింపబడి, వాటిమీద వాలుతాయి. ఆఅందాన్ని మనం చూడలేక పోవడంలో మానవ శక్తి యొక్క హద్దు లగపడు తున్నాయి.

మామూలు తెల్లకాంతిలోనే వివిధ రంగు కాంతులు మిశ్రమమై ఉన్నాయనీ, వివిధ రంగు కాంతులంటే, వేరువేరు అల పొడవులుకల కాంతులనీ తెలిసికొన్నాము. మనము ఎక్కడేనా ఏదేనా రంగు చూశామంటే, అక్కడి నుండి ఆ ప్రత్యేక రంగుకల కాంతి కిరణాలు వచ్చి, మన కంటిమీద పడుతున్నాయన్న మాట. సాధారణంగా సూర్యునినుండి వచ్చే తెల్లకాంతి మన చుట్టుపట్ల ప్రదేశమంతా వ్యాపిస్తుంది. వేరువేరు సందర్భాలలో మనము వేరువేరు రంగులను చూస్తున్నామంటే, అందులోని రంగు కాంతులు వేరయి, మనకంటిమీద పడుతున్నాయన్నమాట. ఈవేరవడం వివిధ కారణాలుగా జరుగవచ్చును. వర్ణవైచిత్ర్యాలకు గల కొన్ని ముఖ్య కారణాలను పరిశీలిద్దాం

వేరు రంగుల కాంతులను వేరుచేసి, మనకంటి కింపుగూర్చడంలో గాజు పట్టకమున కున్న నేర్పును గురించి ఇది వరకు తెలిసికొన్నాము చిన్న పిల్లలకు పట్టకము నిస్తే, గంటల తరబడి ఉత్సాహంతో రంగులను చూసి ఆనందిస్తారు. ఈ వర్ణ వైచిత్ర్యానికి కారణం వక్రీభవన మన్న మాట. కాంతి కిరణాలు గాలిలోనుండి గాజులోనికే కాక, నీటిలోనికి పోయినపుడుకూడ వంగుతాయి గదా, ఇదేమనకంత హృద్యంగా ఉండే ఇంద్రధనుస్సుకి కారణం. వర్షం కురుస్తున్నప్పుడు సూర్యకాంతి నీటిబిందువులలో ప్రవేసించి, వక్రీభవనం పొంది, తిరిగివచ్చి మనకంటిని ప్రవేసిస్తుంది. అటువంటప్పుడు, వేరు వేరు రంగుల

కాంతులు వేరు వేరు కోణాలలో వంగుట చేత, వేరయి, వరుసగా ఏర్పడి, ఇంద్రధనుస్సుగా అగపడతాయి. అప్పుడప్పుడు దట్టంగా మేఘాలు వేసినపుడు. చంద్రుడు గుడికట్టడం చూస్తాము. అంటే చంద్రుని చుట్టూ రంగులవలయాలు ఏర్పడతాయి. ఎరుపునుండి ఊదావరకు ఏడురంగుల వలయాలు ఒకదాని చుట్టూ ఒకటి ఉంటాయి దీనికికూడా కారణం చంద్రకాంతిముందున్న చిన్నమంచు కణాలలో ప్రవేశిస్తూ, వక్రీభవనం పొందడమే. వక్రీభవనం ఇలాగ అనేక సందర్భాలలో వర్ణవైచిత్ర్యాలకు దారితీస్తుంది.

ఆకాశపు నీలిమకు కారణంచెప్పిన వాడు మనభారతీయ శాస్త్రజ్ఞుడు సర్. సి. వి రామన్. కాంతిఏదైనా పదార్థం గుండా ఒక దిక్కులో పోతున్నప్పుడు చాలాకాంతి ఆదిక్కులోపోతుంది. కాని కొద్దికాంతి మట్టుకు పదార్థపు అణువులతో ఢీకొని, ఇతర దిక్కులకి చిందబడుతుంది. దీనిని Scattes Ring of Light అంటారు. కాంతిపదార్థం గుండా పోతున్న దిక్కుకి లంబ దిక్కులో మనం చూసినాకూడా, ఈ కారణం మూలంగా కొద్దిగా కాంతి అగపడుతుందన్నమాట. ఆదిక్కులో చిందబడిన, లేక పరిక్షింప బడిన కాంతికిరణాలువస్తాయి. తెల్లకాంతి పదార్థంగుండాపోతునప్పుడు, ఇలాచిందబడిన కాంతి సాధారణంగా నీలిగా అగపడుతుంది. దీనికి కారణమేమంటే పదార్థంగుండా పోతున్న కాంతిలో ఎరుపు రంగుకాంతి నీలిరంగుకాంతి దరిదాపు సమానంగా ఉన్నా, నీలిరంగుకాంతి ఎరుపురంగు కాంతికంటే పదిరెట్లెక్కువగా చిందబడుతుంది. ఇలాగ చిందబడిన కాంతిలో నీలిరంగు కాంతికి ఎరుపురంగు కాంతి పది రెట్లెక్కువుండుటచేత, మొత్తం మీద అది నీలిగా అగపడుతుంది. సముద్రంయొక్క గంభీర నీలవర్ణానికి ఈకాంతి పరిక్షేపణే కారణం. సూర్యుని నుండివచ్చే తెల్ల కాంతి సముద్రపు నీటిలో చొచ్చుకొని పోతూంది. మనము సముద్రము వైపు చూచినపుడు, నీటిలో చిందబడిన కాంతి కిరణాలు మనకళ్ళను చేరుతాయి. అందువలన సముద్రం నీలిగా అగపడుతుంది. అలాగే సూర్యునినుండి వచ్చేకాంతి కిరణాలు గాలిలోనిఅణువులతో ఢీకొని పరిక్షేపింప బడతాయి. మనము సూర్యునికి కొంతదూరంగా ఆకాశంవైపు చూసినపుడు, అలాగ పరిక్షేపింప బడినకాంతి మనకళ్ళల్లో ప్రవేశించి, ఆకాశంనీలంగా




అగపడేటట్లు చేస్తుంది. తక్కువఅల పొడవుకల ఊదానీలం కాంతులెక్కువగా చిందబడుటచేత పదార్థంలోనుండి తిన్నగా పోయిన కాంతిలో ఎక్కువఅల పొడవుకల ఎరుపురంగు కిరణాలెక్కువ ఉంటాయి. అందుచేత తిన్నగాపోయిన

కాంతి కొంతవరకు ఎరుపురంగు కలిగి ఉంటుంది. సంధ్యాసమయ మప్పుడు సూర్యునినుండి వచ్చేకాంతి చాలాదూరం దట్టమైన గాలిలోనుండి ప్రయాణంచేస్తూ పరిక్షేపణ మూలంగా నీలికిరణాలను చాలావరకు పోగొట్టు కుంటుంది. అదే అప్పటి సూర్యునిఅరుణ వర్ణానికికారణం.

వర్షం వెలిసినప్పుడు తారురోడ్ల మీద చిన్న గుంటల్లో నీరు చేరుతుంది. దానిమీద మోటారు ఇంజన్ల నుండి కారిన నూనె చినుకులు వ్యాపిస్తాయి. నూనె పల్చని పొరగా గుంటలోని నీటి అంతటిమీదా వ్యాపిస్తుంది. మనము నడుస్తూ అటువంటి గుంటలవైపు చూస్తే ఎన్నో రంగు లగపడతాయి. కొంత కాంతి నూనెపొర పైతలం నుండి ప్రతిఫలిస్తుంది. కాని కొంత కాంతి నూనె పొరగుండా ప్రయాణంచేసి, నీటి పై తలమునుండి ప్రతిఫలిస్తుంది. ఇలాగ రెండు తలాల నుండి ప్రతిఫలించి కాంతి కిరణాలు కొన్ని కొన్ని సందర్భాలలో ఒకదాని నొకటి సంహరించుకొనే, కొన్ని కొన్ని సందర్భాలలో ఒకదాని నొకటి బలపరచుకునే గుణం కలిగి ఉన్నాయి. దీనినే, ఇంటర్ ఫిరెన్సు అంటారు. కాంతి స్వభావం గురించి ఎన్నో విషయాలు తెలియడానికి ఈ ఇంటరు ఫిరెన్సు ప్రయోగాలే కారణం అలాగ రెండు తలాల నుండి ప్రతిఫలించిన కాంతిలోని రంగులు ఇంటర్ ఫిరెన్సు వలన వేరగుతాయి. అందుచేత ఆ నీటిగుంట వేపు చూస్తూ నడుస్తున్నప్పుడు ఎన్నో రంగులగపడతాయి. సబ్బునీటిని బుడగలక్రింద ఊది చూశామంటే, వివిధరంగు లగపడడానికి కారణం ఇంటరు ఫిరెన్సే.

కాంతిని తమగుండా పోనిచ్చే గాజు, నీరు, గాలివంటి పదార్థాలు వక్రీభవనం, పరిక్షేపణ, ఇంటరుఫిరెన్సుల మూలంగా రంగులను కల్పించడం ఇంతవరకు చూశాము. కాని చాల సందర్భాలలో మనం చూసేవి కాంతిని అడ్డివేసేకాంతి నిరోధక పదార్థాల రంగులు. ఒకపువ్వు ఉందంటే, దానిమీద కాంతి పడినపుడు దానిగుండా పోకుండా వెనుకకు తిరిగి వస్తుంది అలాగ తిరిగివచ్చిన కాంతి ద్వారా మన మా పుష్పాన్ని చూస్తున్నాము. పుష్పం ఒక రంగుని చూపిస్తూందంటే. ఇతర రంగుల కిరణాల నన్నీ ఆ పుష్పం గ్రసించడం అంటే మ్రింగివేయడం, ఆ రంగు కిరణాలను మాత్రం ప్రతిఫలించి పైకి పోనియ్యడం కారణం. ఒక ఆకుమీద కాంతి పడ్డప్పుడు అది ఆకుపచ్చరంగుని తప్పించి ఇతర రంగుల కాంతుల నన్నిటినీ పూర్తిగా గ్రసిస్తుంది. ఆకుపచ్చరంగు కిరణాలు ఆ ఆకునుండి వ్యాపిస్తాయి. అటువంటి కాంతి మన కంట్లోపడి, ఆకును ఆకుపచ్చరంగులో అగపడేటట్లు చేస్తుంది. అలాగే మందార పుష్పం నుండి ఎఱ్ఱని రంగుకాంతి కిరణాలు మాత్రంవచ్చి కంటిలోపడి ఆ పుష్పాన్ని ఎఱ్ఱగా అగపడచేస్తాయి. చిత్రకారుడు కాగితం మీద పూసే రంగు ముద్దలు, నూనె రంగులు కూడా కొన్ని రంగుల కాంతి కిరణాలను గ్రసించి, కొన్ని రంగులను మాత్రం ప్రతిఫలించుటచేతనే ఆ రంగు లగపడుతున్నాయి. అసలు

ఏ రంగు కాంతినీ ప్రతిఫలించకుండా అంత కాంతినీ గ్రసించే వస్తువు నల్లగా అగపడుతుంది.

కాంతిని కొంతవరకే తమ గుండా పోనిచ్చే పదార్థాలగుండా చూసినపుడు కూడా రంగులగపడతాయి. అటువంటి పదార్థాలు కొన్ని రంగుల కాంతులను గ్రసించడం, కొన్నిరంగులను మాత్రమే తమ గుండా ప్రయాణం చెయ్య నివ్వడం ద్వారా రంగులను చూపెడతాయి. నీలి గాజుతో చెయ్యబడిన కళ్ళద్దాలతో మనము దేనిని చూసినా నీలిగా అగపడుతుంది. దానిలోనుండి నీలిరంగు కిరణాలు మాత్రంప్రయాణం చెయ్యగలవు. ఇతర రంగుల కిరణాలన్నీ గ్రసింపబడతాయి. దీని ద్వారా వస్తువులను చూసినప్పుడు, వాటిదగ్గరనుండి వచ్చిన కిరణాలలోని నీలి కిరణాలు మాత్రం కళ్ళను చేరుటవల్ల అవి అన్నీనీలిగా అగపడతాయి. అసలు వస్తువు నుండి వచ్చే కిరణాలలో నీలిరంగు లేనపుడు, అది దీనిద్వారా నల్లగా అగపడుతుంది.

సూర్యకాంతో, సాధారణ దీపము నుండి వచ్చిన తెల్లకాంతో వస్తువుల మీద పడ్డప్పుడు, అవి రంగుల నెలాగ చూపెడతాయో తెలిసికొన్నాం. అసలు వాటంతట అవే రంగుల నిచ్చే దీపాలు కొన్ని ఉన్నాయి. పెద్దపట్టణాలలో కొన్ని షాపులముందు ఎఱ్ఱని దీపాలు వెలుగుతూ ఉంటాయి కొన్నిచోట్ల పచ్చని దీపాలుంటాయి. నియాన్ అనే వాయువును విద్యుత్తు సాయంతో శక్తివంతం చేస్తే, దాని పరమాణువులు శక్తివంతమై, కొంతశక్తిని ప్రత్యేక అల పొడవుకల కాంతి రూపంలో వెలువరిస్తాయి. అందుచేత ప్రత్యేక రంగు కల — నియాను విషయంలో ఎరుపురంగుకల — కాంతి వస్తూంది సోడియము అనే పదార్థం ఆవిరిని అలాగే విద్యుత్తు సాయంతో శక్తి వంతంచేస్తే, అది పసుపుపచ్చరంగు కాంతి నిస్తుంది. అదే సోడియం దీపం. అలాగే వేరు వేరు పదార్థాలను విద్యుత్తు సాయంతో శక్తివంతం చేసి రంగు రంగుల దీపాలను సృష్టిస్తున్నారు శాస్త్రజ్ఞానం ఉపయోగంతో.

ప్రకృతిలో ఇటువంటి రంగుల దీపాలు ఉత్తరదక్షిణ ధృవాలవద్ద అప్పుడప్పుడు వెలుగుతూ ఉంటాయి. వాటిని అరోరాబొరియాలిస్, అంటారు. వాతావరణంలో రాపిడివలన కలిగిన విద్యుత్తు వాతావరణ వాయువుగుండా ప్రవహిస్తూ దానిని శక్తివంతం చేయడంవలన ఆరంగు లేర్పడుతున్నాయి. ప్రకృతి తన ఈ సహజసౌందర్యాన్ని మానవులు ఎక్కువగా ఉండేచోటకాక, నిర్మానుష్యమైన ధృవాలవద్ద ప్రదర్శించడం సంతాపవిషయం.

ఇలాగ రంగులన్నవి కాంతిలోనే ఉన్నాయి. కాని పదార్థంలోలేవు. వేరు వేరు పదార్థాలు వేరువేరు రంగుకాంతులను ఇవ్వడం వలననో, ప్రతిఫలించడం వలననో, వేరు చేయడంవలననో మనం రంగులను చూస్తున్నాం. ఈ రంగులను చూస్తు న్నప్పుడు మన కన్ను మాత్రం ఒక్కొక్కప్పుడు మనను మోసగించవచ్చును. అసలు కాంతిలో రంగులన్నీ సమానప్రాధాన్యం కలిగి

ఉన్నా, మనదృష్టిలో మాత్రం మూడు రంగులు మూలములైనవి. ఊదా, ఆకుపచ్చ, ఎఱుపురంగు కాంతులచే సులువుగా ప్రేరేపింపబడే మూడు నాడుల చివరలు కంటిలో ఉన్నాయి. అందుచేత ఈమూడూదృష్టికి ప్రధానమైన రంగులు. ఇతరరంగుల కాంతులు పైనాడులను జతలుగా ప్రేరేపించడంవలన చూడబడతాయి. పసుపుకిరణాలు కంటిమీదపడినపుడు, ఎఱుపు, ఆకుపచ్చలకు సంబంధించిన నాడులను ప్రేరేపించి అగపడతాయి. కనుకనే ఎఱుపు, ఆకుపచ్చ రంగుకిరణాలు ఒకేసారి కంటిమీదపడినప్పుడుకూడా, పసుపురంగు కాంతిగా అగపడతాయి. అందువలన పసుపురంగు కాంతి కిరణాలను చూస్తున్నప్పుడు, అవి నిజమైన పసుపురంగు కిరణాలో, ఎరుపు ఆకుపచ్చరంగు కిరణాల మిశ్రమమో చెప్పలేము. అది మన దృష్టి జ్ఞానం లోపమే. కన్ను అలసినప్పుడొకప్పుడు మనను మోసం చేస్తుంది. ఎఱుపురంగు వస్తువుని తదేకంగా చూస్తూ, కన్ను అలసి పోయినప్పుడు, హటాత్తుగా ఆ ఎఱుపు వస్తువుకి బదులు తెల్లవస్తువునుచూస్తే అదితెల్లగాకాక ఆకుపచ్చగా అగపడవచ్చును. ఎఱ్ఱరంగుకు చెందిన నాడులు అలసిపోయి. క్షణికంగా పని చెయ్యకపోవడమే దీనికి కారణం.

అతి చిన్నవస్తువులను చూడడంలో కూడా కన్ను మోసగిస్తుంది. పసుపు రంగు వస్తువు అతి చిన్నది, కంటికి తెల్లగా అగపడుతుంది. అలాగే నీలంది నల్లగా అగపడుతుంది. ఇటువంటి దానికి కారణం ఊదా కిరణాలకు చెందిన నాడులు చిన్న వస్తువులను చూస్తున్నప్పుడు ప్రేరేపింపబడక పోవుటేనని శాస్త్రజ్ఞులు ఇటీవలనే ఊహిస్తున్నారు.

రంగులు పదార్థంలో లేవు. కాంతిలోనే ఉండాలని ఇది వరకను కున్నాం. కాని కాంతి ఒక శక్తి. అలలరూపంలో ఒక కదలిక వ్యాపించడమే కాంతి ప్రసరణ. ఆ అలలలో రంగేముంది? కాంతి తరంగాలు వేరు వేరు అలపొడవులతో వ్యాపిస్తున్నాయి, అంతేకాని వాటికి రంగులేమిటి అని యోచిస్తే, అవును, వాటికి రంగులు లేవని తోస్తూంది. వేరు వేరు అలపొడవులతో వచ్చిన కాంతి తరంగాలు కన్నుమీదపడి, అక్కడి వేరువేరు నాడులను ప్రేరేపించినపుడు, మెదడు వేరు వేరు ప్రేరేపణలను వేరువేరు రంగులుగా ఊహించుకొంటూంది. అయితే మనము చూసే ఈ వింత రంగులన్నీ పదార్థంలోగాని, కాంతిలోగాని లేనేలేవా? మన ఊహలోనేనా ఉన్నాయి? ఈ రంగులన్నీ మిథ్యేనా? ఏమో. విజ్ఞానశాస్త్రజ్ఞులు, తార్కికులు, వేదాంతులు ఏమనుకోసీగాని, కవి ప్రేయసిపైడివన్నియ కవికీ, అరుణపతాకర క్తిమ సామ్యవాదికీ రియాలిటీలు.

# శ్రమికజాతి మేల్కొన్నది

శ్రీ దాశరథి కృష్ణమాచార్య

తర తరాల
దరిద్రాల
బరువులతో
కరువులతో
క్రుంగి క్రుంగి
కుమిలి కుమిలి
ఖైదులకు
కాల్పులకు
'సహనం'తో
'శాంతం'తో
బలిపశువై
తల వాల్చిన
దీన పరా
ధీన జాతి,
శ్రమిక జాతి
దెబ్బతిన్న
బెబ్బులివలె
మేల్కొన్నది
మేల్కొన్నది
విశ్వ విపణి
వీధికలో
చావు చాల
చవకైనది
బ్రతుక్కు బ్లాక్
మార్కెట్ ధర;
వ్యాపారులు
ప్రపంచాన్ని
తుంచుకోని
పంచుకోని
పరిపాలి
స్తున్నారు;
శ్రమజీవుల
రక్తధార
జలంకంటె
చులకనైంది;
రైతు-కూలి
ప్రజలంతా
ధనికుల పా
దాల క్రింద
చీమలవలె
చితికినారు;
శాంతానికి
సహనానికి
దహన క్రియ
జరిగింది;
దరిద్రత
పరతంత్రత
గిరులవోలె
పెరిగినాయి
చెలియలి క
ట్టలు దాటిన
ప్రళయకాల
జలధివోలె
తిరుగుబాటు
పరచుకుంది;
విశ్వరుద్ర
ఫాలంలో
విప్లవాక్షి
విరిసింది;
పరతంత్ర
ప్రజాకోటి
ప్రళయ వృష్టి
కురిసింది;
స్వాతంత్ర్యో
ద్యమ శంఖం
దిగంతాల
మొరసింది;
పగుల నున్న
జ్వాలా ముఖి;
బడబానల
భరిత జలధి;
పిడుగులురలు
పెను మేఘం;
చిచ్చంటిన
స్నిగ్ధాటవి;
పొగులుతున్న
భూగర్భం
హరగళ గత
హాలాహలం;
శ్రమిక జాతి
కదిలింది;
ప్రజాద్రోహి
వర్గానికి లయ కాళిక
శ్రమిక జాతి
శ్రమిక జాతి
మేల్కొన్నది
మేల్కొన్నది

# గ్రంథ సమీక్ష

## ఉదయశ్రీ

(ఖండకావ్యముల సంపుటి)
రచయిత :
జంధ్యాల పాపయ్యశాస్త్రి "కరుణశ్రీ"
పబ్లిషర్స్ : సుందరరాం & సన్స్, తెనాలి.
వెల రు. 1-4-0
దొరకుచోటు: శ్రీ కృష్ణా బుక్ డిపో-తెనాలి

ఇందులో ముప్పయిమూడు ఖండ కావ్యాలున్నాయి. అందులో కొన్ని కళాఖండాలు హృదయాన్ని దూసుకు పోయేటంత పదునుగా వున్నాయి. రచనలో రమణీయత, మార్దవం, సుకుమారం ముప్పిరిగొన్నాయి. మృదళమైన పదాలు, కళాస్పదమైన రీతులు, లలితమైన శయ్యలు యీ ఖండకావ్యాలకు ముఖ్యాలంకారాలు. చెయి తిరిగిన రచయిత గావడంవల్ల ఎంతటి డొంకతిరుగుడు భావ తురంగాన్నైనా, పదాలనే కళ్లెంతో వెనక్కులాగి కుదించి సూటిగా పాఠక హృదయానికి తగిలేట్టు చెప్పగల సామర్థ్యం బాగా సంపాయించుకున్నాడు. ప్రతి పదంలోనూ, కరుణ, కమ్మదనం కాపురం చేస్తున్నట్టు కనబడుతోంది.

బహుశా యీ కవి కరుణాత్మ గావచ్చు. లేకపోతే కవిపేరు 'కరుణశ్రీ' అని మరోసారి చెప్పుకొనుటలో ఔచిత్యం కనిపించదు. ప్రతి పద్యంలోనూ హృదయముంది. శబ్దమైత్రి సహజంగానూ, సామరస్యంగానూ చిత్రించబడింది. ప్రయోగాలన్నీ మెత్తగానూ, కొత్తగానూ హృదయాని కతుక్కుంటున్నాయి.

మచ్చుకు కొన్ని మాత్రం.

"వంద నందన వనాలు"
"రాధనురా ప్రభూ నిరపరాధనురా"
"విరులన్నియు జాలిగ నోళ్లు విప్పి మా ప్రాణము దీతువా యనుచు బావురుమన్నవి"
"తల్లికి బిడ్డకు వేరు సేతువే"
"నీచేతి తాలింపు కమ్మదనము భరతదేశాన గుమగుమ పరిమళించె."

ఈ మాటలు కవిహృదయపుష్పంలో నుంచి వాచ్చాయంటే అతిశయోక్తిలేదు.

"దూలుదారాలతో గొంతు కురి బిగించి
గుండెలోనుండి గ్రుచ్చి కూర్చి
ముడుచుకొందురు ముచ్చటముడుల మమ్మ
అకట దయలేనివారు మీ యాడువారు"

"గుండె తడిలేక నూనెలో వండి పిండి
అత్తరులుచేసి మాపేద నెత్తురులను
కంపుదేహాలపై గుమాయింపు కొరకు
పులుముకొందురు హంత మీకొలమువారు"

ఇది గుమాయింపు కోసం, మజా కోసం, మానవులు పుష్పాలకుచేసే అత్యాచారమని పువ్వులచేత కవి అనిపిస్తాడు.

ఇందులో కోటానుకోట్ల పేదహృదయాలను కరుణాత్మకమైనకవికలం ఎలా మేలుకొలపిందో స్పష్టంగా బోధపడుతుంది. ధనవంతుడు పేదవాడి నెత్తురే విధంగా పీలుస్తున్నాడో ద్యోతక మవుతుంది. ఒక్కమాటలో చెప్పాలంటే స్వార్థంతప్ప పరార్థమాలోచించని పెట్టు

బడిదారీసమాజంయొక్క నగ్నస్వరూపం బట్టబయలవుతోంది మజాకోసం మానవుడుచేసే దౌష్ట్యం, ఆ పేదహృదయాని కున్నబాధ ఆలోచించాక, "తల్లికి బిడ్డకు వేరుసేతువే" అన్నమాట విన్నప్పుడు నాజీ నరహంతకుల పైశాచికకృత్యాలు, నేటి నైజాం దురంతాలు కళ్ళకుకట్టినట్టు చిత్రించబడుతున్నాయి.

అయితే మొత్తమంతా అన్యాపదేశమే. ఇదే కవిలోవున్న ప్రత్యేకత.

ఇందులో చక్కని సృష్టి వైచిత్ర్యముంది. కవి వూహాకందని వస్తు వుండదు. అందువల్ల ఎంతో లోతుకు పోయి నోరులేని పుష్పాలచేత జాలిగా యేడిపిస్తాడు....

కవిపుష్పంగా మారి జాలిలో లీనమై పోయాడు. అప్పుడు అతనిలోనుంచి వచ్చే ప్రతి ఒక్కమాట, తన శత్రువర్గం యొక్క హృదయాలను ఎంతకఠినంగా కదిలిస్తోందో పైపద్యాల్లో వ్యక్తమవుతోంది.

కొద్దిమాటలలో పెద్ద భావాన్ని పొదగడమే కవిలోవున్న కళాకౌశలం. దీనికి భిన్నంగా కొద్ది భావాన్ని బయటపెట్టడానికి పెద్ద పెద్ద మాటలతో పెనుగులాడితే అదివిద్వత్తుకు లక్షణం గావచ్చుగాని, కవిత్వానికి లక్షణంగాదు. యీరచయితలో కళాకౌశలం, శిల్పసంపద సమృద్ధిగా వుంది.

"వంద నందన వనాలు"
"గుండె కుదిలించి నీముందు కుప్పవోతు"
"తల్లికి బిడ్డకు వేరుసేతువే"
"రాధనురా ప్రభూ నిరపరాధనురా"

ఈ భావాలను మరోవాక్యాల్లో చెప్పాలంటే, నిజంగా ఆ భావాలను హత్యచేసినంతపని జరుగుతుందనుకుంటాను.

సంస్కృతంలో ఒక కొత్తపోలిక ఉంది.

రామ రావణుల యుద్ధం. రామ రావణుల యుద్ధం లాగానే వుందని. అంతకంటే పెద్ద యుద్ధం పోల్చడానికి మరొకటి కనిపించలేదట. పై వాక్యాలు గూడా అంతే అవి వాటిలాగానే వున్నాయిగాని, మరో వాటిలాగా లేవన్న మాట. "ఉత్తిష్ఠ" "పుష్పవిలాపం" "పోతన" "తెనుగుతల్లి" "సార్ధకత" "స్వేచ్ఛాపుష్పాలు" చాలా బాగున్నాయి.

దేశమంతటా జాతీయత పొంగులు వారుతున్న యీ రోజుల్లో పాత కథల్ని కొత్త మాటల్లో పెట్టేదానికంటె, కొత్త కథల్ని కొత్త మాటల్లో పెట్టడంలోనే యెక్కువ ప్రయోజనముంది. మొత్తానికి యీ కావ్యమంతా చదవడానికి శ్రావ్యంగానూ, వినడానికి యింపుగానూ వుంది. పదాలకు పొందిక, భావాలకు జీవం తొణికిసలాడుతూ కావ్యమంతా ద్రాక్షాపాకంలో నడిచింది. కొండమీదినుంచి దొర్లే సెలయేటి నీటి కెరటాలు మాదిరిగా దూకుతున్నాయి కొన్ని కావ్యాలు. యీ కవి కలానికున్న వాడి, భావానికున్న వేడి, ఆంధ్రులకు అపరిచయం గాదు. ముందు ముందు యింతకంటె మహోన్నతమైన ఖండకావ్యాలను సృష్టించి ఆంధ్ర ప్రజా జీవితాన్ని తీర్చి దిద్దుతారని ఆశిస్తున్నాను.

— శివరామకృష్ణయ్య

# పిలుపు

శ్రీ కొనకళ్ళ వెంకటరత్నం

ఉక్కుతల్పుల వూచ
లొక్కమైనా విడదు,
సంకెళ్ళ బిగువింత
సడలి పోనే లేదు ;
కత్తులే జళిపించుతావా !
సోదరుల
కుత్తుకల్ తెగనరుకుతావా ?

హిందూత్వ మనరాదు :
ఇస్లా మసలెకాదు .
పొరుగువానిని వెన్ను
పోటుతో బలిగొంట
పశుమతోన్మాద మిది పోరా,
మతమంటె
మతిలేని మారణక్రీడా ?

అణువుబాంబును మించి
గణన కెక్కిన రవ్వ
పైవా డొకడు రువ్వి
పయనమౌతున్నాడు ;
వెనకచూపులు మానుమనరా ;
జంటగా
వెన్నంటి తరుముకొనవేరా ?

క్రూరహింసన, ప్రతీ
కార హింసాకాండ
గొలుసు కట్టిన తీరు
కొనలు సాగిన నాడు,
ఒక్క పురుగైన మనదోయీ !
మనసీమ
ఒక యెడారై కనలునోయీ !

ఈ వృధా మతకక్ష,
లీ క్రధావిల దీక్ష
పగవానిపై పూన్కి
రగులు కొల్పిననాడు
ఎంచుకో స్వాతంత్ర్య ధనము
లేకున్న
పంచుకో పారతంత్ర్యమ్ము.

ఏ తల్లి గడ్డపై
నేవు చెందిన దొడల్
ఆ తల్లి వక్షాన
హాలాహలము చిమ్మి
ఏజాతి వెలుగొందునోయీ ?
భవితవ్య
మెంత చీకటికోణమోయీ !

కనవోయి వినువీధి
మన గెల్పు బావుటా
సన్నదమ్ముల నెత్తు
రంటుకొన్నది నేడు
అనలాన జీరాడి చనునో....
మనచేతి
కందకే దూరమయ్యేనో....,

# 'కులవిద్యలో కూడు లేదు'

శ్రీ అ. నరసింహ శర్మ

పడాల రావనం పె బొబ్బిలియుద్ధంలో పేరుపొందినవాడు. గొల్లలకి బీడునిలపడంకోసం కాటమరాజు తరఫున వీళ్ళ పూర్వులు యుద్ధంచేసేరు. ఇదేకాకుండా వీళ్ళపూర్వుల వీరగాధలుచాలాఉన్నాయి. బుజంమీద పూజవేసి చిన్నాడగ్రామాన్నంతనీ గొత్తెపందెంలో అన్యాయం చేసేరని వెంటతరిమేడు రావన్న మనవడు.

కరువులకి కరిగిన సంసారాన్ని ముప్పై గొత్తెతో అప్పన్నతండ్రి అప్పన్నకి వప్పచెప్పేడు పూర్వులవీరగాధలు వినడం అప్పన్నకి సరదా, వీరత్వం కృశించినా, జీర్ణించిన అప్పన్నలో నశించలేదు

మునకాలు పడితే ముప్పైమందిని నిలపెడతాడు.

రాత్రి జామున్నరౌతూంది. హస్తె బారెడు పొద్దెక్కింది. కుమ్మరి[1] సారె సగంతూలింది.

వెనక్కి మడకమ్మ తగిలించి మునకాలుబుజంమీద వేసుకున్నాడు.కుక్కను తీసుకొని అప్పన్న మందకాపు కెళ్ళేడు. వెళ్ళడంతోటే మందకదిపి సందకాపులనిఇంటికి పంపేడు. ఇంతలో మొత్తం [2]తోగవాళ్ళు, కట్టిదాలాయ, పామునరసాయ కూడావచ్చేరు. నరసాయరావడంతోటె

"బూతోరి రాపొచ్చెండా" అని అడిగేడు.

"అడికేటి పోనాది. సల్లగ సరసం సేసి నిక్కుతూ నీలుగుతూ ఒత్తాడు" అన్నాడు దాలాయ.

"ఆ(-అందరూ అనవే. ఎవుడు మానీసెండో మొన్న [3] ఎవకలనివ్వేళ్ళి [4] ఉతకెత్తనేదా ? ఇట్టె కనుగిడితెట్టి ఎల్లిపోనావు" అన్నాడు నరసాయ.

"మనమూ ఈడు నేటిసేసినాము ? ఈతముల్లు కాలంగదా ; కంచారొస్తె కాపెట్టి నువ్వుకూడా కునుకెట్టు" అన్నాడు అప్పుడు.

"మన కాలానికి ఈళ్ళకీ సాటేటి ? సీపురుపిల్లికాడమందాచి సీతానగరమత్తోరింటికెల్లి సుక్కదూరీ సరికి మందకాడే ఉండేవోణ్ణి. అప్పుడేటి, గొత్తెలు చేలు మేత్తాయని భయమా ? జాగిలాలు నక్కలరానిచ్చేవా ? ఇప్పుడీ శలక్కాయ పుట్టి ఎక్కడలేని చెలకలూ వరకట్టి పసువు లుసురోసుకుతిన్న. ఎన్నిసేసినా ఒబరికెడే. పొలానికి మందనేదు. పశుకి మేతనేదు. ఈళ్ళకేటి సాడా ? పంటా ? సామాన్నెమేటి గొల్లుసురూ గొడ్డుసురూ" అన్నాడు నరసాయ.

1 విశాఖ నక్షత్రం.

2 తొగ = గొత్తెలమంద.

3 ఎవకల = వేసువయాము. 4 ఉతక = తలుపు తిరుగుటకైనకొయ్య (ఉత్తరాశికొయ్య) కుదుపు అనికూడ అర్ధము.

"మేపుల్లేక కాయిలా [1] పడి మందలన్నీ మణిగిపోనాయి! ఎక్కొచ్చే మందలు పోనాయిగదా! ఇప్పుడు ముగ్గురతోగలూ కలిసినా ఆమందకి సాటినేదు. ఏటేటా పిల్లలు కరుసుకి అమ్మడమే గదా?" అన్నాడు అప్పడు.

"ఔనుగాని జాఁటోతు నమ్మిసినావేంది" అన్నాడు లచ్చాయి.

"ఇల్లు నేతకొచ్చింది. పొలంలో చెఱుకుటోరు ముడస్తన్నాను కరణం అడ్డం గిరగబడిపోయెండు. శా! మొగమేన సూసెందుకాడు. మన సిసవిసలాడి సంతకెల్లి పది పోగులురెల్లు, పది కఱ్ఱలుకొని ఇల్లు నిలేశన్ను. ఈళ్ళకేటి గుండె తెగుబుట్టుందో మందాపులు మానీసెన్రుగదా! ఏటో ఎరువు బస్తాలంట. బండెడు పెంటకి బస్తా బుగ్గి సాలుతాదా? కంట్రోలొచ్చిందని బత్తేలెగేశంన్రుగదా? కంట్రోలొస్తే కడుపెటుపోద్ది? తెగుళ్ళొచ్చి మందలు మాసిపోతన్నాయి. చినుకు పడితే అది గెట్టడానిక్క [2] అంజడు నేల లేదు. గొఱ్ఱెకీ గొల్లోడికీ ఎక్కడనేని ఇనాసం పట్టుకుంది. మా ఈరకాడు పట్టపోడు గదా? గొఱ్ఱె లమ్మిసి ఆడితో కూలికి రమ్మంతండు. ఆడేటి పోలీసోసి.నాగుసెడ్డీ ఏస్తండు. చేప, జెల్లా వొండుకుంతన్నారు. ఆడి తమ్ముడికి ఇస్కూలు బడిలో దొరల సదువు సెప్పిస్తండు. ఉన్నోరు ఒదలడమా అని పరకాయిత్తన్నాను. మీ బొట్టె ఎలిపోదామంతాది. మా యమ్మిని ఆళ్ళ చిన్నతమ్ముడు సదువుతండు ఆడికిమ్మంతంది ఈ పొద్దు సూపు కొచ్చెన్రు" అన్నాడప్పన్న.

"ఏ టప్పన్నా! అమ్మికి పట్టపు సంబందమే! పోకిరీలకి దిగవోకు" అన్నాడు దాలాయ.

"దాలాయ మావా? ఈ "ముండ్రాల" బతుకు నాకు నచ్చనే. పరువా మర్యాదా?

సరే గాని, పట్టపోళ్ళతో కరుసెట్ట గలవా? అందకంతన్నాను" అన్నాడు దాలాయ.

"ఎంత కరుసెట్టయినా ఆ సంబందమే సేయమంతంది మీ యమ్మి. అలపింటిలపింటి సంబందాలు మా దాయి నచ్చవు. కన్నోరింటికాడికి కాపురమెత్తియాలని మా సెపుతంది. నాకూ దాని మాతింసె ఆలాగె అనిపిస్తంది" అన్నాడప్పడు.

"అందకేనా మావా మందుకొనుక్కో అని సెపుతన్నావు" అన్నాడు దాలాయ.

"మా కిద్దరవంతు సేసిఇచ్చి"అన్నాడు నరసాయ.

మాకు [3] ఆసరానేదు. అందకీ గుమ్మిలోనే కూలాలి. దీనికి సాయం గుడ్డెముక్క సూసుకొని బతుకుదామని ఆస.

ఇలా మాటాడుతూ దుక్కిబెద్దలు సదునుచేసి మడకమ్మవేసి గట్టుకి తల ఆనించి పడుకున్నారు ముగ్గురూ. పొలి కాపువచ్చి కదుపు కదుపుతూ ఉన్నాడు.

1 కాయిలా = జబ్బు. 2 అంజడు = పాదము తీసివేయునప్పుడు ఆ రెంటికి మధ్యనుండు నంత. 3 ఆసరా = డాపు, పట్టు

తెల్లవారింది. గొఱ్ఱెలుగట్టెక్కించేరు. చల్లందులుతిని • గోపులిప్పి పాలు తీసేరు. తాపుల గొడ్డుకితలకాలరు తగిల్చేరు.

పాలచట్టి పట్టుకొని "పంచాంగ బూతకాడికెళ్ళి మూర్తం బెట్టించమన్నారు" అన్నాది అప్పడు పెళ్ళాం లచ్చి.

"బావనెల్లి మూర్తం పెట్టించమననేక పోనావా" అన్నాడు అప్పడు.

"కతికితే అతకదని నీఅడుగుల మీదే ఎలిపోనారు. నీకోసం రోడ్డు పని వాళ్ళతో మాటాడి కూలి కుదిర్చేండట, బేగి రమ్మంతండు"అని చెప్పింది లచ్చి

సరే అని లచ్చాయికి సరసాయమందప్పచెప్పి ఊళ్ళోకెళ్ళేడు. ముహూర్తం వారన్నాడు నిశ్చయించేడు పురోహితుడు. బావకి పెందరాడే చెప్పాలని సాయంకాలం బయల్దేరేడప్పడు. తలకి వేపనూనె రాసి ఆ చెయ్యి ఒంటికి రాసేడు. ఇల్లు నూపు పెళ్ళిపిలుపు కలిసి వస్తాయని లచ్చి కూడా బయలుదేరింది. నాగుతీగ అడ్డకమ్మి తగిల్చి కోక కట్టింది.

అప్పడు తలపాగావేసి బయల్దేరేడు. చేతి మునకాల విసురిని కాలందుకుంటూంది. వెనకాల లచ్చి కుక్కపరుగుతో నడుస్తూంది. పట్నంవెళ్ళి, బావగారింటిలో దూరేరు. వీది గుమ్మం రెక్కతలుపులు దానిమీదంటించిన సినీమా తారల బొమ్మలు చూచి అప్పన్నకి మనస్సులో తన యింటి ఉతక తలుపు, పెరటి తడక జ్ఞాపకమొచ్చింది.

లోపల మంచం కనిపించింది. మనుషుల నడకలు మాటలు అంతా పూర్వం చూసినవైనా వింతగా కనిపించేయి. ఆటనుండివచ్చిన చిన్నబావ నమస్కరిస్తూ పలకరించేడు. ఉప్పొంగిన మనస్సుకి తిడుతూన్న కరణం జ్ఞాపకమొచ్చేడు. "పల్లెటూరు బతుకేటి బావా! నాను యిక్కడే ఉంతాను మరా వూరెల్లను" అన్నాడు అప్పడు.

"నాతో నాలుగునాళ్ళు కూలికి రా. తరవాత నీకే తెలుస్తుంది మజా" అన్నాడు అప్పడి బావ.

అప్పడు అలాగే చేసేడు. రోజుకి రెండురూపాయీలు కూడా గిట్టడం జరిగింది.

"కులవిద్యకంటె కూలిమేలు బావా" అని పట్నవాసం స్థిరపడింది అప్పడికి. గొఱ్ఱెల తాసీల్దారు గొఱ్ఱెల నమ్మమని నిర్బంధించినా అమ్మలేదు అప్పడు.

• గోపులు. గొఱ్ఱెల సిరాలకు కట్టుగుడ్డలు.

# ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం

## చతుర్థ మహాసభ, మద్రాసు

[జనవరి 18, 19 తేదీలలో]



## ఆహ్వాన సంఘ విజ్ఞప్తి

ఆంధ్రాభ్యుదయ రచయితల సంఘం చతుర్థమహాసభ జనవరి 18, 19 తేదీలలో మదరాసులో జరుగుతుంది. న్యాయమూర్తి శ్రీ పి. వి. రాజమన్నారుగారు మహాసభాధ్యక్షులుగా ఉండడానికి దయతో అంగీకరించారు. శ్రీ కె. ఎ. అబ్బాస్ గాని, శ్రీ ముల్కరాజ్ ఆనంద్ గాని సభాప్రారంభకులుగా వస్తారు.

ఈ నాలుగేళ్ళూ ఆంధ్రాభ్యుదయ రచయితల సంఘం చేసినకృషి, ఆంధ్ర ప్రజల ఆదరణ పొందగలిగింది. పెదపూడి ఆంధ్ర సాహిత్య పాఠశాలద్వారా సాహితీరంగంలో కొంత నూతన వికాసం కలిగించింది. కథా సంపుటాలు, నాటికా సంపుటాలూ ప్రచురించింది. మొదట 'తెలుగు తల్లి' అనే మాసపత్రికను ప్రకటించింది. ఇప్పుడు 'అభ్యుదయ' అనే మాసపత్రికను ప్రకటిస్తున్నది. ఈ విధంగా ఆంధ్ర సాహిత్యాభ్యుదయానికీ, కళావికాసానికీ సేవచేస్తూనే ఉంది

రాబోవు మహాసభకు ఆంధ్రసాహితీపరులైన పెద్దలనూ, యువకులనూ ఆహ్వానిస్తాము. తమిళ, కన్నడ, కేరళ సాహితీపరులలో పెద్దలను ఒకరిద్దర్ని ఆహ్వానించి, ఆ యాసాహిత్యాలు యీ నవయుగంలో ఎలాగ అభివృద్ధిపొందుతూ వచ్చాయో వారిద్వారా వివరంగా తెలుసుకోవడానికి ప్రసంగాలు ఏర్పాటు చేస్తాము. వీరేశలింగం మొదలుకొని నేటివరకూ మనసాహిత్యం ఎలాగ మారుతూవచ్చిందో సమగ్రంగా చర్చించుకొని, ప్రజలకు అందజేయడానికి ఇదొక అమూల్యమైన అవకాశం.

నూతన జాతీయ సంస్కృతికీ, కళావికాసానికీ కేంద్రంగా ఉన్న మన మద్రాసు నగరంలో ఈ సభలు జరుగుతున్నాయి. ఈ రెండు రోజులూ మద్రాసు పట్టణం కళానిలయం కావాలి. సాహిత్య ప్రసంగాలు, కావ్యపఠనాలు, నాటక ప్రదర్శనాలు, బుర్రకథలు మొదలైనవి ఉంటాయి. ఆంధ్ర చిత్రకళాప్రదర్శనంకూడా

ఏర్పాటు చేయడానికి ప్రయత్నిస్తున్నాము. ఈ కార్యక్రమం కొనసాగించడానికి ఆరువేల రూపాయలు ఖర్చవుతుందని అంచనా వేయబడింది. పోషకులకు నూట పదహార్లున్ను, గౌరవ సభ్యులకు యాభై రూపాయలున్ను, సభ్యులకు పది రూపాయలున్ను రుసుముగా ఏర్పరిచాము.

కనుక ఆంధ్రులూ, ఆంధ్ర సాహిత్యాభిలాషులూ, కళావేత్తలూ అయిన మద్రాసు పౌరులందరినీ ఈ మహోత్సవం జయప్రదంగా జరగడానికి సాయపడమని కోరుతున్నాము.



ఇట్లు,

**ఆహ్వాన సంఘం.**

అధ్యక్షులు :

వేంబయూరి గోవిందరాజాచారి

ఉపాధ్యక్షులు :

మోటుపల్లి రామానుజరావునాయుడు

కోశాధికారిణి :

దర్శి సుభద్రమ్మ

కార్యదర్శులు :

దేవులపల్లి కృష్ణశాస్త్రి
నార్ల వెంకటేశ్వరరావు
కొడవటిగంటి కుటుంబరావు

కార్యవర్గం :

సీలంరాజు శేషయ్య
పిలకా నరసింహమూర్తి
తాపీ ధర్మారావు
జి. వి. సుబ్బారావు (ప్రిన్సిపాల్)



# ఆంధ్ర అభ్యుదయ రచయితల చతుర్థ మహాసభ

## మదరాసులో — 1947 జనవరి 18, 19

## స్థానిక సంఘాలకు విజ్ఞప్తి

ఆంధ్ర అభ్యుదయ రచయితల చతుర్థ మహాసభ 1947 జనవరి 18, 19 తేదీలలో మదరాసు త్యాగరాయనగర్ వాణీ మహలులో జస్టిస్, శ్రీ పి. వి. రాజమన్నారుగారి అధ్యక్షతను జరుగుతుంది. ఈక్రింది విషయాల్లో స్థానికసంఘాలన్నీ పూర్తిగా కృషిచేసి, మహాసభా విజయానికి తోడ్పడాలని ప్రార్థన.

1 ప్రతినిధులు : అభ్యుదయ రచయితల సంఘంలోని ఏ సభ్యుడైనా ప్రతినిధిగా రావచ్చు ప్రతినిధిగా రాదలచుకున్న ప్రతిసభ్యుడూ 15 వ తేదీలోపుగా ప్రతినిధి రుసుం రు. 4 లు చెల్లించి, ఆహ్వాన సంఘంవారికి తెలియజేయాలి. ప్రతినిధులందరూ 17 వ తేదీ నాటికే మదరాసు చేరుకొనేటట్లు స్థానిక సంఘాలు శ్రద్ధవహించాలి.

2. కళా ప్రదర్శనం : 17 వ తేదీ సాయంత్రం కళా ప్రదర్శనం ఏర్పాటు చేయబడుతుంది. ఇందులో ప్రదర్శింప దలచిన తమ తమ చిత్రాలను చిత్రకారులు 15 వ తేదీలోపుగానే ఆహ్వానసంఘం వారికి అందజేయాలి. ఆయా ప్రాంతాలలోని చిత్రకారులందరూ ఈ ప్రదర్శనంలో పాల్గొనేలా స్థానిక సంఘాలు కృషి చేయాలి.

3. కావ్యపఠన, వ్యాసపఠన : మహాసభలో తాము చదువదలచిన కావ్యాలుగానీ; వ్యాసాలుగానీ రచయితలు ముందుగా (15 వ తేదీకల్లా) రాష్ట్ర సంఘ కార్యదర్శికి మద్రాసు పంపాలి. ప్రతినిధులుగా వచ్చే రచయిత లందరూ ఈ విషయంలో పూర్తిగా తోడ్పడుతారని ఆశిస్తున్నాం;

4. సభ్యత్వం : జనవరి 10 వ తేదీనాటికి ఆయా స్థానికసంఘాలు చేర్చిన సభ్యుల పట్టిక నొకదానిని 15 తేదీ లోగానే రాష్ట్రసంఘ కార్యదర్శికి మద్రాసు పంపాలి. సభ్యత్వ రుసుం వగైరా తతిమ్మా ఉత్తర ప్రత్యుత్తరాలన్నీ "ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం" (గవర్నరుపేట, బెజవాడ) తోనే జరుపుకోవచ్చు. మహాసభకు, సంబంధించిన అన్ని ఉత్తర ప్రత్యుత్తరాలూ ఈ క్రింది చిరునామాలకు వ్రాయండి.

**దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు,**
కార్యదర్శి, ఆంధ్ర అభ్యుదయ రచయితల
చతుర్థ మహాసభ ఆహ్వాన సంఘం.
7. లక్ష్మణచెట్టియార్ వీధి, T'నగర్, మద్రాసు

**చదలవాడ పిచ్చయ్యగారు**
(కార్యదర్శి,
ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం)
11, అరుళమ్మాళ్ వీధి, T' నగర్, మద్రాసు

# 'అభ్యుదయ' ప్రచురణలు

| | | |
|---|---|---|
| *౧. | ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘ ప్రథమ మహాసభా సంచిక | 0- 8-0 |
| *౨. | అభ్యుదయ రచనల సంపుటి | (ప్రతులు లేవు) |
| *౩. | వీరేశలింగ వర్ధంతి సంచిక | 0-10-0 |
| *౪-౧౨. | 'తెలుగుతల్లి' సంచికలు (తొమ్మిది సంచికలు) | 5-14-0 |
| *౧౩. | మహాకవి గురజాడ అప్పారావుగారి జీవితచరిత్ర | ప్రతులు లేవు |
| *౧౪. | గిడుగు రామమూర్తి పంతులుగారి జీవితం | ప్రతులు లేవు |
| *౧౫. | చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి స్వీయచరిత్ర | 3- 0-0 |
| *౧౬. | వీరేశలింగంగారి ప్రహసనాలు | 0- 6-0 |
| ౧౭. | చదలవాడ గీతాలు | 0- 3-0 |
| ౧౮. | తెలుగు పూలు (బాలబాలికలకు) | 0- 3-0 |
| ౧౯. | 'ఏమిమగవాళ్ళు!' (నాటికలు) | 0-12-0 |

* ఈ గుర్తుగలవి 'ప్రజాశక్తి ప్రచురణాలయం, బెజవాడ' వారివద్ద దొరుకుతాయి తక్కినవాటికి 'అభ్యుదయ' కార్యాలయానికి వ్రాయండి

సం చందా రు. 6 | విడి ప్రతి అ. 8

# అభ్యుదయ

## సచిత్ర సాహిత్య మాసపత్రిక

ఆంధ్ర అభ్యుదయ రచయితలసంఘం ఏ మహత్తరాశయాలతో కృషిచేస్తున్నదో ఆ ఆశయసిద్ధికోసం అభ్యుదయ నిరంతరం పాటుపడుతుంది. ఆంధ్ర సాహిత్యాభ్యుదయానికీ, ఆంధ్ర కళాభ్యుదయానికీ కృషిచేస్తుంది.

'అభ్యుదయ' రచయితల పత్రిక. ఆంధ్రదేశంలో విజ్ఞానవంతులందరి ఆదరాభిమానాలను చూరగొన్న సాహిత్య పత్రిక.

—: ప్రకటన రేట్లు :—

| | | | |
|---|---|---|---|
| కవరు 4 వ పేజీ | రు. 40 | లోపలిపేజీ 1 కి | రు. 20 |
| కవరు 2, 3 పేజీలుఒక్కొక్కటి | రు. 30 | ½ పేజీ | రు. 12 |

6 నెలలకు కంట్రాక్టురేటు 20% తక్కువ

రెండుమూడు రంగులలో ప్రకటనలు చేయించదలచినవారు మేనేజరుకు వ్రాయండి

అన్ని వివరాలకు :— మేనేజరు, 'అభ్యుదయ'
గవర్నరుపేట — బెజవాడ.

Editor, Printer & Publisher : C. Pitchayya
Secretary, Andhra Progressive Writers' Association, Governorpet, Bezwada
Printed at Prajasakti Press. Q. H. No. K 3. A.




స్వ స్వతంత్ర భావాలతో

నిర్మిస్తున్న




స్వతంత్ర ఫిలిమ్సు... మదరాసు.17

KALADHAR